# భారత ప్రశస్తి

'నన్నపార్యుని భారతాంధ్రీకరణ ప్రశస్తి'


రచయిత

ఎంజీపి. శ్రీరామచంద్రమూర్తి, బి. ఏ.

మండల అభివృద్ధి అధికారి


్య సంకలితము వెల రు. ౩/-

**శివానందలహరి**

శ్రీ మచ్ఛంకర భగవత్పాదులు రచించినది కీ. శే.
ముకుంద రామమూర్తి గారి యాంధ్రాను వాదముతో-
విశ్వేశ్వర నక్షత్రమాల - మాహేశ్వరీ స్తోత్రములతో
[illegible]

వెల 4/-

**ధ్యానయోగము**

బ్రహ్మశ్రీ సూరి రామసుబ్రహ్మణ్య శాస్త్రిగారి
విరచితము

వెల 3/-

**భారత ప్రశస్తి**

రచన
ఎంజీపి. శ్రీరామ చంద్రమూర్తి, బి.ఏ.

వెల 3/-

ప్రతులకు వలయువారు :

ఎంజీపి. శ్రీరామచంద్రమూర్తి
ఇంటి నెం. 1-4-40
మామిళ్ళగూడెం, ఖమ్మం.

శ్రీరస్తు

శ్రీ హయగ్రీవాయ నమః

శ్లో॥ జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం
ఆధారం సర్వ విద్యానాం హయగ్రీవ ముపాస్మహే. ౧

శ్లో॥ శరదిందువికాస మందహాసాం
స్ఫురదిందీవర లోచనాభిరామాం
అరవింద సమాన సుందరాస్యాం
అరవిందాసన సుందరీ ముపాసే. ౨

శ్లో॥ వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషం
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిం. ౩

శ్లో॥ వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే
నమో వై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః. ౪

శ్లో॥ అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహు రపరో హరిః
అఫాలలోచన శ్శంభుః భగవాన్ బాదరాయణః ౫

———

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ వాఙే గిరిజా శ్చిరాయ దధతో
వక్షో ముఖాఙ్గేషు యే
లోకానాం స్థితిమావహ న్త్యవిహతాం
స్త్రీ పుంసయోగోద్భవామ్
తే వేదత్రయమూర్తయ స్త్రీ పురుషా
స్సంపూజితా వ స్సురై
ర్భూయాసుః పురుషో త్తమామ్బుజ
భవ శ్రీకన్ధరా శ్శ్రేయసే.

శ్రీ కృష్ణ ద్వైపాయనుండను బ్రహ్మర్షి తొల్లి వేదంబు లేకీభూతంబులై యేర్పడకున్న ఋగ్యజుస్సామాథర్వంబులుగా విభాగించి తన శిష్యులయిన పైల వైశంపాయన సుమంత జైమినులం బంచి వేదవ్యాసుండై నిజ తపో మహత్త్వంబునం జేసి బ్రహ్మచేత ననుజ్ఞాతుండై యష్టాదశ పురాణములును నీతి ధర్మ శాస్త్రార్థ తత్త్వంబులును జతుర్వేద వేదాంతాభిప్రాయములును జతుర్వర్గ వర్గానుబంధ బంధుర కథేతిహాసంబులును జతుర్యుగ మహర్షి రాజవంశ చరితంబులును జతుర్వర్ణాశ్రమ ధర్మ క్రమంబులును జతుర్ముఖ ప్రముఖ నిఖిల సురమునిగణ పూజితుండైన శ్రీకృష్ణుని మాహాత్మ్యంబును బాండవాది భారత వీరుల మహా గుణంబులును దన విమలజ్ఞానమయంబైన వాగ్దర్పణంబునం దేర్పడ వెలుగుచుండ-

ధర్మ తత్త్వజ్ఞులు ధర్మ శాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రం బని
కవివృషభులు మహా కావ్య మనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమ పౌరాణికుల్ బహు పురాణ సముచ్చ
యం బని మహిఁ గొనియాడుచుండ
వివిధ వేదతత్త్వ వేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు

ఇది వేదవ్యాస మునీంద్రుఁడు మహాభారత రచన కుపక్రమించిన సందర్భమును నన్నయగారు వివరించిన తీరు. చతుర్వేదములను ఋగ్ యజుర్ సామ యథర్వ వేదములుగా విభజించి తన శిష్యుల చేత వేద సూత్రములఁ జేయించి పంచమ వేద మనఁ బఱఁగిన మహాభారత రచన సాగించెను. ఇందు నీతి ధర్మ శాస్త్రార్థ తత్త్వములు, చతుర్వేద వేదాంతాభిప్రాయములు, చతుర్వర్గ వర్గానుబంధ బంధుర కథలు, ఇతిహాసములు, చతుర్యుగ మహర్షి మఱియు రాజవంశ చరిత్రలు, చతుర్వర్ణాశ్రమ ధర్మ క్రమములు, శ్రీకృష్ణ మాహాత్మ్యము, పాండవాది భారత వీరుల చరిత్రయు నీ మహాగ్రంథమున నిక్షిప్తములు- దీనిని ధర్మ తత్త్వజ్ఞులు ధర్మ శాస్త్రమని పొగడిరి. అధ్యాత్మవిదులు వేదాంత మని పొగడిరి. నీతి విచక్షణులు నీతిశాస్త్రమని పొగడిరి. కవులు మహాకావ్యమని పొగడిరి. లాక్షణికులు సర్వలక్ష్య లక్షణ సంగ్రహ మనిరి. ఐతిహాసికు లితిహాస మనిరి. పరమపౌరాణికులు బహుపురాణసముచ్చయ మనిరి. ఈ వివరణలోని ప్రతి

శబ్దము మిక్కిలి యర్థవంత మైనది. భావ ప్రాధాన్యమైనది. సార్థక మైనది. వ్యాస భగవానుఁ డే లక్ష్య సాధన కొఱకు నెంత పవిత్ర భావముతో నీ భారత సంహితా రచన సాగించెనో మహాభారతము నాంధ్రీకరించిన కవి త్రయమువారును నదే పవిత్ర భావముతో నదే లక్ష్య సాధన కొఱకుఁ గృషి చేసిరి, అందును నాదికవియు వాగనుశాసనుఁడు నైన నన్నపార్యుఁడు తరువాతి వారికి మార్గదర్శకుఁ డయ్యెను. ఇం దనేకములైన యుపాఖ్యానములు సందర్భానుసారముగా వివరింపఁ బడినవి. ఇవి యన్నియు ధర్మ శాస్త్ర ప్రతిబోధకములు. నీతి ప్రబోధకములు. కథా సందర్భమున నీ యుపాఖ్యానము లంత ప్రధానములు కాకున్నను నీతిశాస్త్ర, ధర్మశాస్త్ర ప్రబోధన దృష్టిఁ జూచినచోఁ జాల ప్రముఖ మైనవి.

సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణి చ
వంశానుచరితం చేతి పురాణం పఞ్చలక్షణమ్.

సర్గ మన సృష్టి. ప్రతిసర్గ మన ప్రతిసృష్టి. వంశములు, మన్వంతరములు- పూర్వరాజుల చరిత్రలు నీ యైదు లక్షణములు కలవి పురాణములు.

ధర్మార్థ కామమోక్షాణా ముపదేశ సమన్వితమ్
పూర్వవృత్త మభిజ్ఞాతమ్ ఇతిహాసమ్ ప్రచక్షతే.

ధర్మ, అర్థ, కామ, మోక్ష చతుర్విధ పురుషార్థములతోఁ గూడిన పూర్వరాజుల కథలే యితిహాసములు.

ఇయ్యది కేవలము పురాణము నితిహాసము మాత్రమేకాదు - మహాకావ్యముకూడ. వేదవ్యాసుఁడు మహర్షి; కారణజన్ముఁడు. 'నానృషిః కురుతే కావ్య'మ్మను న్యాయమ్మున వ్యాసభగవానుఁడు మహర్షి కనుకనే మహాభారత కావ్యనిర్మాణము చేయఁగలిగెను.

"కవి ర్మనీషీ పరిభూః స్వయంభూః" అని వైదికమంత్రములందు కలదు. కవి శబ్దము పరమాత్మపరముగా ప్రయుక్తమైనది. సాక్షాత్ ద్రష్టలైన వైదికఋషులు కవులు; వారి కావ్యము లుపనిషత్తులు. వాల్మీకి వ్యాసాదు లట్టివారు. భారతాంధ్రీకర్తయైన నన్నపార్యుఁడు కూడ ఋషి. ఒక యాధునిక కవివర్యులు వక్కాణించినట్లు 'ఋషివంటి నన్నయ్య' యనునది వాస్తవము.

"కవయః క్రాంతదర్శినః"అని కదా వాచోయుక్తి!

అనందవర్ధనుఁడు నుడివినట్లు :

అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే
శృంగారీచే త్కవిః కావ్యే'జాతం రసమయం జగత్
స ఏవ వీతరాగశ్చేత్ నీరసం జాతమేవ తత్
భావనాచేతనానపి చేతనవచ్చేతనానప్యచేతనవత్
వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతంత్రతయా.

అనుటవలన నపారమైన కావ్యప్రపంచమునకు గవియే బ్రహ్మ; అనఁగా సృష్టికర్త,అతఁడు తనకోరిక ననుసరించి లోకమును సృజించును శృంగారి యగుచో లోకమునంతను శృంగారమయ మొనర్చును. విరాగి యగుచో లోకమునంతను నీరస మొనర్చును. చేతనవస్తువుల నచేతన వస్తువులుఁగా నచేతన వస్తువుల చేతన వస్తువులుగా వ్యవహరించును.

కావ్యం తు జాతు జాయేత కస్యచిత్ప్రతిభావతః' అని,

అనఁగా ప్రతిభావంతుఁడైన కవి వలన నొక్క కావ్యమే సృజింపఁ బడును. బహుకావ్య నిర్మాతలైన కాళిదాసాది మహాకవు లీ సూత్రమున

కపవాదము కృష్ణద్వైపాయనుఁడు పరమాత్మ స్వరూపుఁడు. అట్లే భార తాంధ్రీకరణధురంధరుఁడైన నన్నపార్యుఁడును ఋషికల్పుఁడు; ఉత్తమ శీలుఁడు. భారతావతారికలో తన్నుగూర్చి తాను చెప్పికొన్న సీసములో-

తన కులబ్రాహ్మణు ననురక్తు నవిరళ
జపహోమ తత్పరు విపులశబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
నానాపురాణ విజ్ఞాననిరతుఁ
బాత్రు నాపస్తంబ సూత్రు ముద్గలగోత్ర
జాతు సద్వినుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్య రచనాభి
శోభితు సత్ప్రతిభాభి యోగ్యు
నిత్య సత్యవచను మత్యమరాధిపా
చార్యు సుజను నన్నపార్యుఁ జూచి-

అనుటవలన నన్నపార్యుఁడు అవిరళ జపహోమతత్పరుఁడు; నిత్యసత్యవచనుఁడునై తాను ఋషికల్పుఁడై భారతాంధ్రీకరణార్హతనుఁ బొందినాఁడు. తాను మహాభారతాంధ్రీకరణము గావించిన విధము నిట్లుగా వివరించెను.

పాయక పాకశాసనికి భారత ఘోరరణంబునందు నా
రాయణునట్లు వాసిగ ధరామరవంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడుం దన కిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడునై నవాఁ డభిమతస్థితిఁ దోడయి నిర్వహింపఁగన్.

నారాయణభట్టు వాఙ్మయధురంధరుఁడు- తనకిష్టుఁడు; సహాధ్యా యుఁడు; అతఁడు తనకుఁ దోడయి నిర్వహించెను- ఎట్లు? పాయక పాక

శాసనికి భారత ఘోర రణంబునందు నారాయణునట్లు- అనునది యతిశ యోక్తిగాఁ గానుపించును. నారాయణభట్టు తనకుఁ జేసిన సహాయము సామాన్యమైనదేయయ్యుఁ గృతజ్ఞతాభావమున నన్నపార్యుఁ డట్లుగాఁ బేర్కొని యుండవచ్చును. దీని నాధారముగాఁ జేసికొనియే కొందఱు వక్రబుద్ధు లాంధ్రభారత రచనను నారాయణభట్టుకే అంటగట్టుటకుఁ బ్రయత్నించిరి. నన్నపార్యుఁడు తనకు దోడయిన మిత్రులనే కృతజ్ఞతా భావమున బేర్కొన్న వాఁడు గురువునుఁ బేర్కొనకపోవుట- గురుస్తుతి చేయకపోవుటకు గతంబు గానరాదు.

సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లో
నారసి మేలునా నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగాన్.

తాను నానారుచిరార్థసూక్తినిధి యఁట! కవీంద్రులు తన ప్రసన్న కథా కలితార్థయుక్తిని, యక్షరరమ్యతను నాదరింతు రఁట! జగద్ధితము కొఱకు మహాభారత సంహితారచన బంధురుఁడయ్యె నఁట! మహాభారత మును సంహిత యనెను.

'పదప్రకృతి స్సంహితా.' అనఁగా వేదమునందలి పదపాఠమునకుఁ బ్రకృతి భూతమగు పాఠము. అనఁగా నిది వేదమునకు వ్యాఖ్యానమని భాష్యమని యర్థము. వేదములు ప్రభుసమ్మితములు. పురాణములు మిత్ర సమ్మితములు, కావ్యములు కాంతా సమ్మితములు. నన్నపార్యుఁడు తెనుఁ గున పంచమ వేదమునకు భాష్య మనఁదగిన మహాభారతమును రచింప సమకట్టెను. ఇందలి భాగములకు పర్వములని పేరు.

'సారం పర్వణి పర్వణి
ప్రతిపర్వ రసోదయమ్'

అని వాచో యుక్తి- పర్వమనఁగా కణుపని యర్థము. చెఱకుగడ యందలి కణుపులకుఁ బర్వములని రూఢ్యర్థము; ఇక్షుఖండము నందువలెనే భారతమునందలి ప్రతిపర్వమునను రసము చిప్పిలుచుండును. ఇందు పదునెనిమిది పర్వములు కలవు, అం దాది సభా పర్వములును నరణ్య పర్వములోఁ గొంత భాగమును నన్నపార్యుఁ డాంధ్రీకరించెను. ఈతనిది ముఖ్యముగా కథా కథనశైలి. మధ్యమధ్య నెన్ని యుపాఖ్యానములు చెప్పినను పూసలలో దారంబు మాడ్కి వస్త్వైక్యతకు భంగము లేదు. ఈయన శైలి పెక్కుచోట్ల కదళీ పాకములో నుండును. రసోచితమైన శైలి నాశ్రయించి పద్యమును శ్రావ్యముగా సుఖముగా రచించుటలో నన్నయ్యగారు తరువాత కవులకు నొజ్జబంతి. నన్నయ్యగారు ప్రదర్శించిన కవితాకౌశలము, కథా కథనశైలి, నానారుచిరార్థసూక్తి నిధిత్వము, రసోచితమైన శైలి, పద్య రచనలో గల సుఖము, మున్నగు విశేషములను దిఙ్మాత్రముగా ప్రదర్శించుటయే నీ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశ్యము.

## 2

భారతమునందుఁగలఁ బెక్కు నుపాఖ్యానములలో నుదంకోపాఖ్యానము మొదటిది. ఈ యుదంకుఁడు పైలమహర్షి శిష్యుఁడు. ఈతఁడు తన విద్యాభ్యాస పరిసమాప్తినంది గురువుఋణము తీర్పనెంచి గురుపత్ని నియోగంబునఁ బౌష్య మహారాజుదేవేరి కుండలంబులు దేరనరిఁగెను. మార్గమధ్యంబున నొక్క మహోక్షంబు నెక్కిచనువాని నొక్క దివ్యపురుషుం గని వానిఁ బన్నిన వృషభగోమయ భక్షణంబుఁజేసిపౌష్యుపాలికిం జనియె. పౌష్యుని పనుపున పౌష్య దేవేరి కుండలంబులఁ గైకొన నుద్యమించి

గోమయభక్షణంబుచే నశుచి యగుటంజేసి మహాసాధ్వియైన దేవేరి దర్శనంబు లభింపదయ్యె. అంత నుదంకుఁడు పూర్వాభిముఖుండై పాదములు ముఖంబు కడిగికొని శుచుండై యద్దేవియొద్ద కుండలంబులఁగొని మఱలె.

ఇఁట పౌష్యుం డుదంకుని భుజింప వేడెను. భోజన సమయమున నన్నంబు కేశదుష్టంబైన రోసి కరం బలిగి యిట్లపరీక్షితంబైన యశుద్ధాన్నంబుఁ బెట్టినాఁడవు. అంధుండ వగుమని శాపంబిచ్చె. పౌష్యుండును నల్గి యల్పదోషంబున నాకు శాపం బిచ్చినాఁడవు. అనపత్యుండ వగుమని ప్రతిశాపం బిచ్చె. ఉదంకుఁడును ననపత్యుండు గానోపక శాపము ప్రగమ్మరింప వేడిన పౌష్యుం డిట్లను.

నిండు మనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణా
ఖండల శస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్క మా
రెండును రాజు లందు విపరీతము గావున విప్రుఁ డోపు నో
పం డతిశాంతుఁడయ్యు నరపాలుడు శాపముఁ గ్రమ్మఱింపఁగన్.

ఉదంకుఁడు మాత్రము శాపమోక్ష ప్రకారం బనుగ్రహించె. ఈ ఘట్టము నం దెంతయో ధర్మ సూక్ష్మము కలదు. బ్రాహ్మణుఁడు నిగ్రహానుగ్రహ సమర్థుడు. కనుకనే శాపమును గ్రమ్మఱించెను. శాపముఁ గ్రమ్మఱింప నోపఁడు నరపాలుఁ డతిశాంతుఁ డయ్యును. కనుకనే యుదంకుఁడు శాపఫలము ననుభవింప వలసియే వచ్చెను. ఎందు వలన? తన కాతిథ్య మొసంగినఁ బౌష్యుని యల్పదోషమున కల్గి దారుణ శాప మొసంగె. ఇందు నుదంకుని బలహీనత, తొందరపాటు కలదు. తన గురు-ఋణము తీర్చు కొఱకుఁ బౌష్యుఁడు తన దేవేరి కుండలముల నొసంగెను. తన గురుని ఋణము తీర్పఁబడుటకుఁ బౌష్యుఁడే కారకుడు. మీదు మిక్కిలి తన కాతిథ్యము నొసంగెను. కనుక నుదంకుఁ డెంతయో పౌష్యునికి ఋణపడి యున్నాడు. ఉదంకుఁడు కృతజ్ఞత చూపక పోగా నంధుండ

వగుమని ఘోర శాప మొసంగిన క్రోధనుఁడు. ఉచితానుచితజ్ఞత నెఱుంగ లేక పోయెను. కావున శిక్షార్హుడు. తాననపత్యుఁడై శాపఫల మనుభవించెను.

మార్గంబున తక్షకుండు కుండలము లపహరించుటయు నుదంకుఁడు నాగలోకంబున కరిగి నాగముఖ్యుల స్తుతించి తక్షకువలన కుండలం బుల మరలం గొని మనముకంటెను, గాడ్పుకంటెను వడిగల హయ ముపై నాలవ నాటికి గురుపత్నికిఁ గుండలంబులు సమర్పించి 'నీ వలన పరమ సంప్రీత హృదయుండ నైతిని నీవును గుర్వర్థంబునందు ఋణ ముక్తుండ వైతివి. నిజేచ్ఛ నుండుమని' యనుమతి నొసంగిననే యుదం కుఁడు నిజేచ్ఛ చనియె. నాఁటి గురుభక్తి శిష్య వాత్సల్యము నట్టివి. కాని తక్షకుడు సేసిన యపకారంబునం జేసి యుదంకుని హృదయంబున ప్రతీ కారవాంఛ రగిలెను. ఉదంకుఁడు జనమేజయుని పాలికిఁ బోయి సర్పయాగో న్ముఖుని గావించె. తనకుఁ దక్షకుఁ డొనరించిన యపకారము నుగ్గడించెను. జనమేజయుని తండ్రియైన పరీక్షితుని హతునిఁ జేసిన విధంబునుఁ దెల్పి జనమేజయునిఁ గ్రోధాగ్నిని రగుల్కొల్పె.

కాదన కిట్టి పాటి యపకారము దక్షకుఁ డేక విప్ర సం
బోధనఁ జేసి చేసె నృపపుంగవ నీవు ననేక భూసురా
పాదిత సర్పయాగమున భస్మము సేయుము తక్షకాదికా
కోదర సంహతిన్ హుత మహోగ్ర సమగ్ర శిఖాచయంబులన్.

ఉదంకుఁడు దీర్ఘకోపనుఁడు. తీవ్రమైన ప్రతీకార వాంఛ కల వాడు. సత్త్వ గుణ సంపన్నుఁడును తపోధనుఁడును నగు నుదంకున కిది కళంకము నాపాదించును.

పెక్కు మారులు సత్య మహిమ వర్ణింపఁ బడినది.

తన యెఱిగిన యర్థం బొరుఁ
డనఘా యిది యెట్లు చెప్పుమని యడిగినఁ జె

ప్పనివాఁడును సత్యము సె
ప్పనివాఁడును ఘోర నరక పంకమునఁ బడున్.

ఈ యనృత దోషమునకు వెఱచియే యగ్ని భట్టారకుఁడు పులో మునఁడను రాక్షసునకు భృగుపత్ని తెఱం గెఱింగించి భృగుమహర్షి క్రోధమునం జేసి శాపగ్రస్తుడయ్యె.

బ్రాహ్మణుని యుత్కృష్టత యీ సందర్భమున లెస్సఁగా వర్ణింపబడియె

అడిచినఁ దిట్టినన్ మఱి మహాపరుషంబులు పల్కి యల్కతో
గొడిచిన యుత్తమద్విజులు పూజ్యులు వారల కెగ్గు సేసినం
జెడు నిహముం బరంబు నిది సిద్ధము కావు నెఱింగి భక్తి నె
ప్పడు ధరణీసురోత్తములఁ బూజలఁ దన్పుదు నల్గ నోడుదున్.

అనెను. నీవు బ్రాహ్మణుండవు. నీ వెద్ది సేసిన నీక చను. లోకహితుండనయిన నాకు శాపం బిచ్చి లోకంబుల కెల్లఁ జెడ్డ సేసితివి. బ్రాహ్మణుని యాధిక్యతనుఁ బొగడుచునే భృగుమహర్షిని మెత్త మెత్తఁగా మందలించెను. నీవు బ్రాహ్మణుండవు నీవు శపించినను నేను ప్రతిశాపం బీయఁజాలను. పైపెచ్చు నీ వెద్ది సేసినను నీక చనునఁట.. ఇందెంతయేని వ్యంగ్యార్థ మున్నది. ఎత్తిపొడు పున్నది. నీవు బాధ్యతా రహితుఁడవని- నేనో లోకహితుండను. నాపై చాలా బరువు బాధ్యత లున్నవి. అగ్ని భట్టారకుని శపించుట వలవ సర్వమైన యజ్ఞ యాగాది క్రతువులు దక్కి న లోక క్రియా వ్యాపారమంతయు దోషజుష్ట మగును; కనుక తన్ను శపించి భృగుమహర్షి యెంతటి గొప్ప తప్పిదము చేసెనో యెఱుంగఁజెప్పెను.

రురుమహర్షి కథాసంగ్రహమునఁ గూడ బ్రాహ్మణుని యుత్కృష్టత లెస్సఁగా నుద్ఘాటింపబడియె.

భూనుతకీర్తి బ్రాహ్మణుకు పుట్టుడు తోడన పుట్టు నుత్తమ
జ్ఞానము సర్వభూత హితసంహిత బుద్ధియుఁ జిత్తశాంతియున్
మానమదప్రహాణము శమత్వము సంతత వేద విద్యను
ష్ఠానము సత్యవాక్యము దృఢవ్రతముం గరుణాపరత్వమున్;

మహాభారతము నందుఁ బేర్కొనఁబడిన ననేకులు మహర్షులు గొప్ప తపోధను లయ్యును శమాగుణము లేక యతికోపనులు, తీవ్రమైన ప్రతీకార వాంఛగల వారును నగుట గమనింతుము నన్నయ్యగా రట్టివారిని వారి లోపములను లోకహితము కొఱకు నెత్తి జూపిరి. ఉదంకుడు, భృగు మహర్షి, రురుఁడు నట్టివారే. వారి పాత్ర చిత్రణమును చక్కఁగా రూప కల్పనఁ జేసెను,

నన్నపార్యుఁడు తన కథా కథనసరళిలో వివరించిన పెక్కు నుపాఖ్యానములలో కద్రూవినతల కథ యొకటి. కద్రూవినతలు కశ్యప ప్రజాపతి భార్యలు. కశ్యపుఁడు పుత్ర కామేష్టి చేసియుండెను. కద్రూ వినతలు పెద్దకాలము కశ్యపు నారాధించి కద్రువ యేవురు పుత్రుల ననల తేజులు దీర్ఘ దేహులు నైనవారలఁ గోరెను. వినతయు భుజవీర్యవంతులను, వారికంటెను ననఁగా కద్రూపుత్రలకంటెను బలాధికులైన వారల నిద్దఱ పుత్రులఁ గోరెను. కద్రూ గర్భాండంబు లేనూఱేండ్లకు దరతరంబ యవిసి వాసుక్యాది యేనూర్వురు కుమారులు పుట్టిరి. వినతయు దనగర్భాండంబుల రెంటను బ్రియనందనులు వెలువడమి యతిలజ్జావనతవదన యైనది. ఈర్ష్యాళు వైనది. ఇఁకనాఁగలేక నొక యండం బవియించినది అందుండి యసంపూర్ణశరీరుండు, నూర్ధ్వతను సహితుఁడు, పూర్వార్థతనూ రహితుండు ననూరు డుద్భవించె-తానసంపూర్ణ శరీరుఁడగుటకు దల్లిపైఁ గినిసి యామెను తన్ను సంపూర్ణ శరీరుంగానీక యవియించిన యవినీతఁగా నిందించి యీ దోషమునకుగాను తాను తన సవతికి నూఱేండ్లు దాసి యగు నట్లు శపియించె.రెండవ యండంబునం దుదయించు పుత్త్రుండు వినత దాసి

త్వము వాపునని( జెప్పి తాను సూర్య రథసూతు(డై యతిగె వినత పేరా సకు, తొందరపాటునకు నీర్ష్యకు ఫలముగా నామె శాప్రగస్తురాలయ్యెను నాటకములో నంతర్నాటకమువలె నుపాఖ్యానములో నింకొకయుపాఖ్యానము. సముద్రమథన వృత్తాంతము. దేవదానవులు సముద్ర మథనమునకు సమ కట్టిరి. మంధరకుధరమును గవ్వము సేసిరి, ఆధారంబుగా( గూర్మరాజును నియమించిరి. యోక్త్రంబుగా వాసుకి నమర్చిరి. గీర్వాణులుం బూర్వ గీర్వాణవ్రాతము నబ్ధి( ద్రచ్చునెడ నందుండి యమృతంబును, జ్యేష్ఠయు(, జంద్రుండును, శ్రీయును, నుచ్చైశ్శ్రవంబును(, గౌస్తుభంబును, నైరావతం బును మున్నుగా(గల ననేకంబు లుద్భవిల్లినవి.

కద్రూవినతలు జంట పన్నిదములు సఱచుకొని వినత కద్రువకు దాసి గావలసియున్నది. ఆ కథాగమనముకొఱకు( గారణ భూతమైన నుచ్చైశ్శ్రవముయొక్క జన్మకు( గారణమైన సముద్రమథన వృత్తాంతము వివరింపవలసి వచ్చెను, తల్లి పనుపున యశ్వంబు వాలంబు నల్లసేయ నోపని యురగప్రముఖులు శాపగ్రస్తులైరి. వారు జనమేజయు సర్ప యాగమున నాహుతులైరి. శాపానుభవభీతచిత్తు(డైన( గర్కోటకుండను వా(డు తల్లి పనుపున నయ్యశ్వంబు వాలంబుబట్టి వ్రేలాడి తల్లిని గెలి పించెను. వినత శాపానుభవమున తన సవతికి దానే నూఱేండ్లు దాసి యయ్యెను. గరుడుని జననము, తల్లిదాస్య వృత్తాంతము తెలియుట, దాస్య విమోచనోద్యోగము మున్నుగా(గలవి కథా సందర్భములు. వినత గరుడునికి నాహారంబుగా విషనిధి యందలి నిషాదుల( బేర్కొనును,భక్షణ విషయమున బ్రాహ్మణునిం బరిహరించునది యనెను.

బ్రాహ్మణు నెఱుంగు టెట్లనిన :

రయమున మ్రింగుడు గాలము
క్రియ నెవ్వ(డు కంఠబిలము క్రిందికి( జన క

గ్నియపోలె నేర్చుచుండును
భయరహితాః వాని నెఱుఁగు బ్రాహ్మణకులుగాన్.

బ్రాహ్మణుండు నిగ్రహానుగ్రహసమర్థుఁడు.

కోపితుండైన విప్రుఁడు ఘోరశస్త్ర
మగు మహావిషమగు నగ్నియగు నతండ
యర్చితుండైన జనులకు నభిమతార్థ
సిద్ధికరుఁడగు గురుఁడగుఁ జేయు ప్రీతి.

ఇప్పద్య మారోహణావరోహణ క్రమములోఁ జూపట్టును. ఘోరశస్త్ర మగు, మహావిషమగు, నగ్నియగు మున్నగు పదముల తీవ్రతను పారుష్య మును ధ్వనింపఁ జేయుచున్నవి. ప్రసాదగుణముకంటె నోజోగుణమెక్కువ. 'అభిమతార్థ ప్రీతికరుఁడగుఁ', 'జేయుఁబ్రీతి' యనుపదములు ప్రసాదగుణ భరితములై సరళముగా నున్నవి.

తదనంతరంబ నిషాదఖాదనము సేయుటయుఁ దన కంఠబిలమున నున్న విప్రుని యాతని భార్యయైన నిషాది కీర్తిప్రియయను దానిని వెల్వ రించుటయుఁ బిమ్మట నిజజనకుఁ గశ్యపుం గాంచి యాతని పనుపున గజ కచ్ఛపంబుల భుజించి మహాసత్త్వ సంపన్నుండై యమృతాహరణార్థం బఱిగె.

ఎంతటితపస్సంపన్నుఁడైనను సంతాన హీనున కుత్తమగతులులేవు. అనపత్యుని పితృ పితామహులు నధోగతు లగుదురు- కనుక నెట్టివానికిని గృహస్థాశ్రమ స్వీకార మనుల్లంఘనీయము. దీని కుదాహరణముగా జరత్కా రుని వృత్తాంతము జెప్పఁబడియె.

జరత్కారువు పరమ తపోనిధి. దారపరిగ్రహణము సేయనొల్లక

బ్రహ్మచారియై ఘోరవ్రతములు జరుపుచుండును.అతం డొక్కనాఁడు పరి భ్రమించువాఁడు వనంబులో నొక్క పల్వలంబుఁ గని యందు మూషిక విలూనంబయి యొక్క మూలంబ తక్కియున్నదాని వీరణతృణ స్తంభంబు నవలంబించి తలక్రిందై యాదిత్య కిరణంబుల నాహారంబుగా వ్రేలుచున్న ఋషులఁ గొందఱఁ జూచెను. జరత్కారు వచ్చెరు వందెనఁట.

'కడు నుగ్రము దలక్రిందుగ
బడి వ్రేలుట యిదియు నొక తపంబొకో'.

అనెనఁట. జరత్కారువు మహాతపోనిధికదా! తలక్రిందుగాఁ దపంబు సేయుట తానెఱుగఁడా? గరుడుఁ డాహారార్థ మరుగుచు నమ్మహాశాఖ నవ లంబించి తలక్రిందై యాదిత్యకిరణంబు లాహారంబుగాఁ దపంబు సేయు చున్న వాలఖిల్యాది మహాముని గణంబులఁ జూచెనని కలదు. ఇయ్యది కడు విచిత్రము.

సమాధానము గా నయ్యధోముఖ విప్రు లిట్లనిరి.

అనఘ యిది యేటి తపమే
మనుపమదుఃఖితుల మగుట నాధారములే
కను సంతానోచ్ఛేదం
బున వ్రేలెద మధమ లోకముల తెరవు చనన్

మందభాగ్యులమయిన మా వంశమున జరత్కారుండను పాప కర్ముండు పుట్టి దారపరిగ్రహంబు సేయను సంతానంబు వడయను నొల్ల కున్నవాఁడు. ఏ మాతని పితృపితామహులము. మా పట్టిన యివురు గంట వేళ్ళెల్లం గాలుండు మూషిక వ్యాజంబునఁ దరతరంబ కొఱికిన నొక్కవేర తక్కియున్నయది. ఇదియును జరత్కారుం డనపత్యుండైనం దెగు, నే మధఃపాతుల మగుదుము. ఆతం డపత్యంబు వడెసెనేని యూర్ధ్వగతుల

మగుదు మనియె. అనపత్యత మహాదోషంబుగా నిరూపింపబడియె. సంతాన హీనుని పితృపితామహు లధఃపతితు లగుదురు. కుటుంబ నియంత్రణ ప్రచారము విరివిగాఁ బ్రోత్సహింపఁ బడుట నేఁటి కాలవైపరీత్యము. పిమ్మట జరత్కారువు వాసుకి చెలియలును, సనామ్నియు నైన జరత్కారును వివాహమాడి యాస్తీకుఁడను పుత్త్రిని వడసె. అతఁడే జనమేజయుఁడు ప్రారంభించిన సర్పయాగమును మాన్పించి యురగముఖ్యులఁ గాపాడెను.

## 3

వేదవ్యాసుఁడు జనమేజయు నాస్థానమున కేతెంచెను. జనమేజయుండును నమ్మునీశ్వరు నుచితరీతిని బూజించి "కురుపాండవుల యుద్ధమునకుఁ గారణమేమి? వారిలో వారేల కలహించి ప్రజాక్షయ మొనరించిరి? ఎఱిఁగి యెఱిఁగి వారలనేల వారింపలేదు. ఇట్టి గోత్రకలహమేల పుట్టె?" అని ప్రశ్నింపఁ గృష్ణద్వైపాయనుండు వైశంపాయనమునిం జూచి శ్రీ మహాభారత కథాఖ్యానం బాద్యంతంబు సవిస్తరంబుగాఁ జెప్పుమని పంచెను.

చేదిదేశమునకు వసువను రాజు కలఁడు. ఇతని ధర్మ పరిపాలనకును దపంబునకును మెచ్చి యింద్రుండు వానితోడఁ జెలిమి చేసెను. వానికి దేవత్వంబును, గనక రత్నమయంబైన దివ్య విమానంబును, నింద్రమాల యను కమలమాలికయును దుష్ట నిగ్రహంబును శిష్టపరిపాలన క్షమంబయిన యొక్క వేణు యష్టియుఁ బ్రసాదించెను. వసువుండు దివ్య

విమానారూఢుండై యుపరిలోకంబునఁ జరించుటంజేసి యుపరిచరుండునాఁ బఱఁగె. ఉపరిచరునకు బృహద్రథ, మణివాహన, సౌబల, యదు, రాజన్యు లనియెడు నేవురుకుమారు లుదయించిన వారల నానా దేశముల కభిషిక్తులఁ జేసిన వారు వేలవేల వంశకరులైరి. ఆపుర సమీపమున శుక్తిమతియను నొక్క నది కలదు. కోలాహలంబను నొక్క పర్వతము శుక్తిమతిని కామించి యడ్డంబుపడె. దాని నుపరిచరుండు తన పాదంబులఁ దొలఁగఁద్రోచెను. ఆ నదికిఁ పర్వత సమాగమంబున వసుపదుండను కొడుకును గిరికయను కొమరితయుఁ బుట్టిరి. ఉపరిచరుండు చేసిన యుపకారమునకుఁ బ్రత్యుపకారముగా శుక్తిమతి వసుపదుని గిరికను వానికి కానుకఁగా నొసంగెను. ఉపరిచరుండును వసుపదుని సేనాపతిగాఁ జేసికొని గిరికను దనకు ధర్మపత్నిగాఁ జేసికొనియె. ఋతుమతియయిన గిరికకు మృగమాంసంబు తేర యుపరిచరుండు వనంబున కరిగె. ఇఁకముందు కథాగమనము చాల విచిత్రముగా నున్నది.

వేఁట కొఱకు వనంబునఁ గ్రుమ్మరుచున్న యుపరిచరుండు నిజ భార్యయైన గిరికా సౌందర్యాతిశయమును భావించుటచే మోహావేశమున రేతస్కంద మయ్యెను. 'రాగమదర భాసురముగ రమణతో వనాంతరమున రేతస్యంద మయ్యె నవనిపతికి నెయ్యమొనర'.

ఆవియును బిందుద్వయము; ఆయ్యమోఘవీర్యంబు నొక్క యజీర్ణపర్ణ పుటంబున నిమ్ముగా సంగ్రహించి యొక్కడేగ యఱుతంగట్టి దీనిం గొనిపోయి గిరిక కిమ్మని యుపరిచరుండు పనిచిన నదియు నతి త్వరితగతి నా కానం గడచి యాకాశంబునం బఱచునప్పుడు వేఱొకడేగ యద్దానితోఁ గలహించుటయు, గాలిచే నా పర్ణపుటంబు నుండి యానృపనందను వీర్యము యమునానదిలోఁ బడియెను. అద్రికయను నప్సరోకన్య బ్రహ్మ శాప వశంబున మీనరూపంబున యమునలోఁ గ్రుమ్మరుచున్నయామె

యవ్వసువీరుని వీర్యబిందువులు ద్రావి గర్భంబుఁ దాల్చె. దశమాసములు నిండె. అంత నొక్కనాఁడు జాలరు లామీనంబు గర్భదళనంబు సేసిన నందుండి యొక్క కుమారుఁడును నొక్క కొమరితయు నుద్భవిల్లిరి. కొమరితయే మత్స్యగంధియైన సత్యవతి; దాశరాజు పెంపుడు కూతురు.

వశిష్ఠుని కుమారుడు శక్తి. శక్తి కుమారుడు పరాశరుఁడు. పరాశరుఁడు గతమదమత్సరుఁడు. త్రిజగ ద్వినుతుండు. తీర్థయాత్రఁ బోవుచు సత్యవతినిఁ జూచి మదనపరవశు డయ్యెను. ఆమెను తన దివ్య దృష్టి యుపరిచరువి కూతుంగా నెఱింగెను. ఆమె నొడబర్చి కన్యాత్వంబు దూషితంబుఁ గాకుండ వరం బిచ్చి మత్స్యగంధంబు సౌగంధ్యంబుగాఁ బ్రసాదించి యామెతోఁ బరాశరుఁడు సంభోగించెను.

పరమేష్ఠికల్పుఁ డగు న
ప్పరాశరు సమాగమమునఁ బరమ గుణైకా
భరణకు ననవద్య మనో
హరమూర్తికి సత్యవతికి నమ్మని శక్తిన్

సద్యో గర్భంబున నహి
మద్యుతి తేజుంతు వేదమయుఁ డఖిల మునీం
ద్రాద్యుఁడు వేదవ్యాసుం
డుద్యత్ జ్ఞానంబుతోడ నుదితుం డయ్యెన్.

కృష్ణద్వైపాయనుండును, గృష్ణాజిన పరిధాన కపిల జటామండల దండకమండలు మండితుండై తల్లిముందట నిల్చి కరకమలంబులు మొగిచి మ్రొక్కి మీకుం బనిగల యప్పుడు నన్ను దలంచునది యాక్షణంబ వత్తునని సకలలోక పావనుఁ డఖిలలోకహితార్థంబుగాఁ దపోవనంబునకుం జని యందు మహాఘోర తపంబు సేయుచు

సంచిత పుణ్యుఁ డంబురుహ సంభవు వంశము దాల్చి పుట్టె లో
కాంచితుఁడైనవాఁడు నిఖిలాగమ పుంజము నేర్పడన్ విభా
గించి జగంబులందు వెలిగించి సమస్త జగద్ధితంబుగాఁ
బంచమవేదమై పరఁగు భారత సంహితఁ జేసె నున్నతిన్.

ఈలాగున నన్నయగారు పంచమ వేదమైన మహాభారత సంహితను జగద్ధితంబుగా వ్యాసభగవానులు రచించెనని పెక్కుమాఱులు వక్కాణించుట విశేషము. నన్నయగారికి వ్యాసభగవానునిపైనను, మహాభారతముపైనను గల భక్తి శ్రద్ధలకు నిదర్శనము.

పరశురాముఁ డిరువదియొక్క మారులు క్షత్త్రియవీరుల సంహరించెను. క్షత్త్రసతులు సంతానకాంక్ష వెలయంగ ఋతుకాలముల మహావిప్రుల దయఁ జేసి పలువురు కొడుకులఁ గూతులఁ బడసిరి. ధర్మము తప్పకుండ ఇట్లు బ్రాహ్మణ వీర్యప్రభవులైన క్షత్త్రియులు ధర్మమార్గమున ప్రజాభిరక్షణంబు చేయుటంజేసి వర్ణాశ్రమ ధర్మస్థితులు దప్పక ప్రవర్తిల్లుటయు, నిత్యాది. సస్యసమృద్ధియుఁ బ్రజాభివృద్ధియు నైన భూదేవి ప్రజాభార పీడితయై భూభారంబు దీర్ప హరినిఁ బ్రార్థించెను. భూభారంబు దీర్చుటకొఱకే దైవాంశ సంభూతులు పాండవులుగాను రాక్షసాంశ సంభూతులు దుర్యోధనాది కౌరవులుగాను జనించిరి.

దేవ దానవుల యుత్పత్తి క్రమము సవివరముగా నిరూపింపఁబడియె. అది యెట్లనిన

ఏకాదశరుద్రుల యంశంబునఁ గృపుఁడు; సూర్యు నంశమునఁ గర్ణుఁడు; ద్వాపరాంశమున శకుని; అరిష్టా పుత్త్రుండయిన హంసుండను గంధర్వరాజు ధృతరాష్ట్రుడు; మతియను వేల్పు గాంధారి; కలి యంశమున దుర్యోధనుఁడు; పౌలస్త్యభ్రాతృ వర్గము దుశ్శాసనాది దుర్యోధనానుజులు;

హిరణ్య కశిపుఁడు శిశుపాలుడు; సంహ్లాదుడు శల్యుఁడు; అనుహ్లాదుఁడు దుష్టకేతుడు; శిబి యనువాఁడు ద్రుమసేనుఁడు; బాష్కళుండు భగదత్తుడు; విప్రచిత్తి యను దానవుఁడు జరాసంధుఁడుగా పుట్టిరి. ఇట్లనేకులైన దేవ దానవులు పాండవ కౌరవులుగాఁ బుట్టిరి. కాలనేమి కంసుండై పుట్టె. స్త్రీ పుంస రూపధరుండైన గుహ్యకుండు శిఖండియై పుట్టె. మరుద్గణాంశమున బాండురాజు పుట్టె. ద్రుపదుడు సాత్యకి, విరాటరాజు మరుత్తుల యంశమునఁ బుట్టిరి. మాండవ్యుం డను ముని శాపంబున యమధర్మరాజును నఖిల ధర్మతత్త్వ విదుండైన విదురుండై పుట్టె సిద్ధి బుద్ధి యను దేవతలు కుంతి మాద్రిగా జన్మించిరి. యమధర్మరాజు నంశమున ధర్మజుండును, వాయుదేవు నంశమున భీముండును, నింద్రు నంశమున నర్జునుండును, నశ్వినీ దేవతల యంశంబున నకుల సహదేవులును, లక్ష్మిదేవి యంశమున ద్రౌపది, యగ్ని యంశమున ధృష్టద్యుమ్నుఁడును పుట్టిరి. కౌరవ వంశ వివరణ మెట్లన.

నిరుపమ ధర్మమార్గ పరినిష్ఠితులై మహియెల్లఁ గాచుచుం
బరిగిన తొంటి పూరు కురు పాండు మహీశుల పేర్మిఁ జేసి భూ
భరవహనక్షమం బగుచుఁ బౌరవ కౌరవ పాండవాన్వయం
బురుగుణ సంపదం బెరిఁగి యొప్పె సమస్త జగత్ప్రసిద్ధమై.

అదితికిఁ గశ్యపునకు వివస్వంతుండును, వివస్వంతునకు వైవస్వం తుండను మనువును, యముండును, శనైశ్చరుండును, యమునయుఁ దప తియు ననంబుట్టిరి. మఱియు మనుపుత్త్రియైన యిల యనుదానికి సోమపుత్త్రుం డైన బుధునకుఁ బురూరవుండు పుట్టెను, వానికి నహుషుండును, నహుషునికి యయాతియుఁ బుట్టిరి. యయాతి దేవయానీ శర్మిష్ఠలను వివాహ మాడు టయు మున్నుగాఁ గల కథాంశములును గలవు.

# 4

తరవాతి కథాభాగము యయాతి చరిత్ర. ఇయ్యది యుపాఖ్యానము కాదు. మూలకథ యందలి భాగము మూలకథకు మూలమైనది. ఇందెన్నియో సామెతలు, నానుడులు, ధర్మశాస్త్ర నీతిశాస్త్ర విషయములు చక్కఁగా నుల్లేఖింపఁ బడినవి. ఈ కథా రచన కావ్యశైలిలో నడచినది. ఇం దపురూప వర్ణనలు, నలంకారములు, కవిసమయములు జొప్పించి కావ్యత్వము నాపాదించెను.

చతురంభోధిపరీత భూవలయమున్ సద్వీప సారణ్య స
క్షితిభృత్కంబగు దాని భూరిభుజశక్తిం జేసి పాలించుచుం
గ్రతువుల్ నూ ఱొనరించి కీర్తి వెలయంగా దిక్కులన్ నిర్జితా
హితుఁడై యా నహుషుండు దాఁ బడసె దేవేంద్రత్వమున్ బేర్మితోన్.

ఆనహుషునకుఁ బ్రియంవద యను దానికి యతి, యయాతి, సంయాతి, ఆయాతి, యయతి, ధ్రువు లనంగ నార్వురు పుట్టిరి. అందు మన కథానాయకుఁడైన యయాతి రాజై "అనేక యాగములు చేసి శుక్ర పుత్త్రియైన దేవయానియందు యదు తుర్వసు లను నిర్వురు కొడుకులును, రాక్షస రాజైన వృషపర్వు పుత్త్రియైన శర్మిష్ఠయందు దుహ్యుఁడు, అనుఁడు, పూరుఁడు అను మువ్వురు పుత్త్రులను వడసె. యయాతి శుక్రుని శాపము వలన జరాభార పీడితుఁడైనంత నాతని జరను దాల్చి యవ్వనంబు నీయ పుత్త్రులఁ గోరిన యదువు మున్నగు పుత్త్రులు మువిమిగొన

నొల్లరైరి పూరుం డనువాడు తన యవ్వనంబు నొసంగి ముదిమి దాల్చి శుక్రు ననుమతంబున యయాతి యనంతరము రాజయ్యె. ఈ ప్రకారము వైశంపాయనుఁడు శరవేగమున కథను నడిపించుచుండఁగా జనమేజయుఁ డొక సంశయమును వెలిబుచ్చెను.

వర్ణ ధర్మముల్ కాచుచు వసుధయెల్ల
ననఘ చరితుఁడై యేలిన య య్యయాతి
భూసురోత్తమ భార్గవు పుత్త్రియైన
దేవయానిని దానెట్లు దేవిఁ జేసె

విపుల తేజమునను దపోవీర్యమునను
జగదనుగ్రహ నిగ్రహ శక్తి యుక్తుఁ
డయిన యట్టు యయాతికి నలిగి యేమి
కారణంబున శాపంబు కావ్యుఁ డిచ్చె.

ఈ సంశయ నివృత్తికొఱకు వైశంపాయనుఁడు యయాతి చరిత్రమును విపులముగా వివరించె. దేవాసుర రణమున మృతులైన రాక్షస వీరులను దానవగురువు మృతసంజీవని విద్య చేతఁ బునర్జీవితులఁ జేయు చుండెను. ఇందువలన దేవత లతిభీతులై శుక్రు నొద్ద మృతసంజీవని విద్యను సంపాదింప బృహస్పతి పుత్త్రుండైన కచు నిట్లు ప్రార్థించిరి.

బాలుండవు నియమవ్రత
శీలుండవు నిన్నుఁ బ్రీతిఁ జేకొని తద్వి
ద్యాలలనా దానముఁ గరు
ణాలయుడై చేయు న మ్మహాముని నికున్.

దుహితృ స్నేహంబునం జేసి యద్దేవయాని పలుకులు శుక్రుం డతిక్రమింపండు కావున నీ నేర్చు విధంబున వాని చిత్తంబు వడసి శుక్రు నారాధించిన నీ కిష్టసిద్ధి యగు ననిరి.

'విద్యాలలనా దానము' అనుట వలన నిందు భావ్యర్థ సూచన కలదు. విద్యాలలన అనునది రూపక సమాసము. విద్య యను లలన. కాని కచునకు విద్యా దానముతోఁ బాటు లలనా దానము కూడ సంభవమే యని ధ్వని. నియమవ్రత శీలుండైన కచుఁడు విద్యాదానమును పరిగ్రహించి లలనా దానమును తిరస్కరించెను. శుక్రునిపై దేవయానికిఁ బలుకుబడి యెక్కువ కావున నీ నేర్చువిధంబున దేవయాని చిత్తంబు వడసిననే కార్యసిద్ధి యగునని హెచ్చరించిరి. ఈ సందర్భము నందలి పద ప్రయోగము నన్నయగారి సందర్భోచితకుఁ బ్రతీక. కచుండును శుక్రుఁ పాలికిం బోయి యిట్లు చెప్పికొనెను.

ఏను గచుండను వాఁడ మ
హానియమ సమన్వితుఁడ బృహస్పతి సుతుఁడన్
మానుగ వచ్చితి నీకును
భానునిభా : శిష్యవృత్తిఁ బని సేయంగన్.

ఆ మునికుమారుని సుకుమారత్వంబును వినయ ప్రియవచన మృదుమధురత్వంబును ననవరత నియమవ్రత ప్రకాశిత ప్రశాంతత్వంబును గాంచి శుక్రుఁడు ముగ్ధుడయ్యెను. వీనిం బూజించిన బృహస్పతిం బూజించినయట్లుగా భావించెను. 'ఆత్మా వై పుత్ర నామాసి' అని కదా యార్యోక్తి. రాక్షస గురువైన శుక్రాచార్యునికి దేవ గురువైన బృహస్పతిపై గల యాదరమున కిది నిదర్శనము. శుక్రాచార్యుని సహృదయతకు సౌజన్యతకు నిది ప్రతీక.

కచుండును పెక్కేండ్లు మనమున చెయ్యవల మాటల నేకాకారుఁడై త్రికరణ శుద్ధిగా శుక్రుని సేవించెను. మఱియంతకంటె దేవయానికి సువిధేయుఁడై ప్రియహిత భాషణములఁ బుష్పఫల విశేష దానముల సంతతఁ

ప్రీతిఁ జేయుచునుండెను. అతఁడు కడునిష్ఠ గురుని గురుతనూజనుఁ గొలిచి య య్యిరువురి నెమ్మి వడసె తనదు నేర్పు పేర్మి.

ఈర్ష్యాళురైన దానవు లొక్కనాఁడు హోమధేనులఁ గాచుచు నేకతంబ యున్నవానిఁ గచుని వధించి యొక్క విశాల సాలస్కంధంబున బంధించి చనిరి. హోమధేనువుల తోడఁ గచుఁడు తిరిగిరాకున్న దేవయాని మలమల మఱుంగుచుఁ బోయి తండ్రితో మొఱపెట్టఁగా మృతసంజీవని విద్యచేఁ గచునిఁ బునర్జీవితుం జేసెను. మఱొక్కనాఁడు కచుని సంహ రించి పొడవుసెడఁ గాల్చి సురతోఁ దడయక యబ్బూది శుక్రుఁ ద్రావిం చిరి. శుక్రుండు సురాపాన మోహితుండై యుండె. దేవయాని మొఱ చెవిన పెట్టఁడాయె. వానిం జూచికాని కుడువనొల్లనని దేవయాని యేడ్చు చున్నంతఁ బెద్దయుం బ్రొద్దునకుఁ బ్రసన్నుఁడయ్యెను, శుక్రుండు తన యోగదృష్టిం జూచి లోకాలోక పర్యంత భువనాంతరంబున నెందుం గచుం గానక సురాసమ్మిశ్ర భస్మమయుండై తన యుదరంబున నున్న కచుం గని సుర సేసిన దోషంబు నెఱింగి యిట్లని తలపోసెను

మొదలి పెక్కు జన్మములఁ బుణ్యకర్మముల్
పరఁగఁ బెక్కుసేసి బడయఁబడిన
యట్టి యెఱుక జనుల కాక్షణ మాత్రన
చెఱుచు మద్యసేవ సేయనగునె?

భూసురు లాదిగ గల జను
లీసుర సేవించిరేని యిది మొదలుగఁ బా
పాసక్తిఁ బతితులగుదురు
చేసితి మర్యాద దీనిఁ జేకొనుఁడు జనుల్.

అని సురాపానంబు మహాపాతకంబుగా శపియించెను. తను

యుదరంబున నున్న కచునిఁ బునర్జీవితుం జేసెను. బుధ నుతుఁడైన కచుండు 'ఉదయాద్రిదరీ ముఖమున నుదితుండైనఁ బూర్ణహిమమయూఖుఁడు పోలె' నిర్గమించెను. విగతజీవితుఁడై పడియున్న వేదమూర్తి దానవగురుఁడు శుక్రాచార్యుఁడు సంజీవితుడై వెలింగె కచునిచే నుపాసింపఁబడిన మృత సంజీవని మహిమచేత. ఎట్లు? 'ఉచ్చారణ దక్షుచేత నభిహితంబగు శబ్దంబు నట్లపోలె' ఏమి యీ యుపమానము? లోకోత్తరమైనట్టిది.

'నానృషిః కురుతే కావ్యమ్' ఋషి కాని వానికి కావ్యనిర్మాణమసాధ్యము. ఇట్టి లోకోత్తరమైన యుపమానము ప్రయోగించుట యనునది ఋషి తుల్యుఁడైన నన్నపార్యునికి చెల్లినది.

శుక్రుఁ చేత ననుజ్ఞాతుండై కచుండు దేవలోకంబునకుఁ బోవసమకట్టి దేవయాని కతిప్రియపూర్వకంబుగాఁ జెప్పిన నామె యిట్లనియె. 'నీవు బ్రహ్మచారివి. నేను కన్యకను. మన యిరువురికి భావజశక్తి నిదివఱకే వివాహమైనది కనుక నన్ను పరింపు'మన్నది. కచుఁ డట్టి భావములోలేఁడు. అతఁడు మిక్కిలి నియమవ్రతశీలుఁడు. గురువును గురుపుత్రిని భక్తి శ్రద్ధలతో సేవించినాఁడే గాని యితరముగాదు. అందువలన దేవయాని పలుకు లాతనికి విషాదకారణములైనవి.

ఆ కచుఁ డత్యంతవిషా
దాకులుఁడై లోకనింద్యమగు నర్థము నీ
వాకునకుఁ దెచ్చు టుచితమె
నాకు సహోదరివి నీవు నాచిత్తమునన్

గురులకు శిష్యులు పుత్త్రులు
పరమార్థమ లోకధర్మపథ మిది దీనిం
గురుతింపక యీ పలుకులు
తరుణీ గురుపుత్త్రి నీకుఁ దగునే పలుకన్?

కచుని ధర్మశీలతకు నిది ప్రతీక. దేవయాని యుచితానుచితజ్ఞ. శూన్య. తనమనోరథము వమ్ము చేసినందులకు మృత సంజీవని విద్య పని. సేయకుండునట్లు శపించెను. కచునకు ధర్మపథంబు తప్పనివాఁడనని యాత్మవిశ్వాసంబు కలదు. కనుకనే తాను ధర్మపథంబుతప్పని వాఁడనేనిఁ దనఁ జేత నుపదేశంబు గొన్నవారికిఁ బనిసేయుంగాక యనియెను. అంతియఁగాక ధర్మవిరోధంబు తలంచిన దేవయానికి బ్రాహ్మణుండు. వివాహంబుగాకుండునట్లు ప్రతిశాపం బిచ్చి చనెను.

ఒకనాఁడు రాక్షస రాజైన వృషపర్వ మహారాజు కూతురు శర్మిష్ఠ. సహస్ర కన్యకాపరివృతయై దేవయానితోడ నొక్క సరోవరమునకు జలకములాడఁ బోయెను. తమ తమ పరిధానముల నొడ్డునఁ బెట్టిరి. గాలి చేత నవి యొండొంటి గలసి పోయినని. వీరలు సంభ్రమమున నొకరి వస్త్రము లొకరు కట్టుకొనిరి. దేవయాని పుట్టములు శర్మిష్ఠ కట్టినది. శర్మిష్ఠ వస్త్రములు పుచ్చుకొనక దేవయాని రోసి యిట్లనియె.

లోకోత్తర చరితుండగు
నా కావ్య తనూజ నీకు నారాధ్యను నేఁ
బ్రాకట భూసుర కన్యక
నీ కట్టినమైల కట్ట నేర్తునె చెపుమా!

తాను భూసుర కన్యక, కావ్య తనూజ, శర్మిష్ఠకు తా నారాధ్య యఁట. ఇందు దేవయాని యొక్క స్వాతిశయము గమనార్హము.

మా యయ్యకుఁ బాయక పని
సేయుచు దీవించి ప్రియము సేయుచునుండున్
మీ యయ్య వెండి మహిమలు
నా యొద్దన పలుక నీకు నానయు లేదే!

ఇది శర్మిష్ఠ ప్రత్యుత్తరము. ఇందుఁ దన రాజ్యగర్వము, అధికార గర్వము, 'మీ యయ్య వెండి మహిమలు నా యొద్దన పలుక నానయు లేదే' యనుటలో నొక సీత్కారభావము వెల్లడి యగుచున్నది. నన్నపార్యునిఁ గపటా శిల్పము ప్రశంసాపాత్రము. అచ్చమైన తెనుఁగు నుడికారము ట్టిపడున దీ పద్యము. మచ్చునకైనను పద కాఠిన్యము లేదు. నన్నపార్యుని కవిత సంస్కృత పద భూయిష్ఠము; నిందు రెండుపాళ్లు సంస్కృత పదములు నొక పాలు తెనుఁగు పదములుండును. ఈతఁడు ఛాందసుఁడు; వట్టి పురాణ శైలి యని కాకమ్మ కథలు చెప్పుదురు. ఇవియన్నియు నిరాధారములు బూటకము లనుట కీ యొక్క పద్యమే సాక్ష్యము నన్నయగారి రచన యంతయు సరళముగా హృదయంగమముగా నడచినది.

నా కట్టిన పుట్టంబు నీకుం గట్టంగాదు గాకేమి యని గర్వంబున నెగ్గులాడి దేవయాని నొక నూతం ద్రోచి చనియె. శర్మిష్ఠ రాచకూతురు. ఆమె గర్వమునుఁ బ్రదర్శించుట సమంజసమే.

పాపము దేవయాని కచునిపై మమతలు పెంచుకొన్నది. కచుఁడు తన విద్యావ్యాసంగము తప్ప వేఱు నెఱుంగఁడు. దేవయానికిఁ గచునిపైఁ బ్రేముడి లేనిచో కచుని కార్యసిద్ధి యయ్యెడిది కాదు. సరికదా యతఁడు సురాసమ్మిశ్ర భస్మమయుండై శుక్రుని గర్భంబున జీర్ణమయ్యెడి వాఁడు, కాని దేవయాని విఫల మనోరథ యయినది. మీదు మిక్కిలి బ్రాహ్మణుండు వివాహంబు గాకుండునట్లు శాపగ్రస్త యైనది. శర్మిష్ఠచేఁ బరాభవింపఁ బడినది. యయాతికి భార్య యైనది. పంతగించి శర్మిష్ఠను దాసిగా జేసికొన్నది. కాని ఇందువలన తాను సవతిపోరు కొని తెచ్చుకొన్నది. దేవయాని పంతగించి నపుడు శుక్రుఁడు క్రోధము తగదని బోధించినాడు.

అనుపమ నియమాన్వితులై
యనూన దక్షిణలఁ గ్రతు సహస్రంబులు చే

సిన వారి కంటె నక్రో
ధనుఁడ కరం బధికుఁ డండ్రు తత్త్వ విధిజ్ఞుల్.

అలిగిన నలుగక యెగ్గులు
పలికిన మఱి విననియట్లు ప్రతివచనంబుల్
పలుకక బన్నమువడి యెడఁ
దలపక యున్నతఁడ చూవె ధర్మజ్ఞు డిలన్.

'కావున బుద్ధి గల వారికిఁ గ్రోధంబు గొనియాడం దగ' దని హితవు చెప్పినను హితవచనంబులనుఁ బెడ చెవినిఁ బెట్టి పంతగించి శర్మిష్ఠను తనకు దాసిగాఁ జేసికొన్నది.

దేవయాని శర్మిష్ఠలు కన్యకా సహస్రంబుతో వనంబున విహరించుచున్న తఱి.

అంగనాజనుల యుత్తుంగ సంగత కుచ
కుంకుమ చందన పంకములయు
వారివ ధమ్మిల్ల భారావ కలిత ది
వ్యామోద నవపుష్ప దామములయు
వారివ ముఖ సకర్పూర తాంబూలాది
వాసనా సురభి నిశ్వాసములయు
వారివ పరిధాన చారుధూపములయు
విలసిత సౌరభావలులు దాల్చి
యనిలుఁ డను దూత వోయి తోడ్కొనియుఁ దెచ్చె
దేవయాని పాలికి మృగతృష్ణఁ జేసి
కాననంబున గ్రుమ్మరు వాని పీరు
నతి పరిశ్రాంతుఁడైన యయాతి నంత.

ఇది యంతయుఁ బ్రబంధశైలిలో నున్న వర్ణన. వేఁట కొఱకు నడవిలోన దిరుగుచున్నవాని, వీరుని, మిక్కిలి దప్పియున్న వానిని యయాతిని వాయు వనెడి దూత వోయి తోడ్కొని తెచ్చెనఁట. అంగనా జనుల యుత్తుంగ సంగత కుచ కుంకుమ చందన పంకముల సౌరభములు, వారు ధరించిన పుష్పదామముల సువాసనలు, వారివే ముఖ సకర్పూర తాంబూలాది వాసనల సురభి నిశ్వాసముల సుగంధములు, వారి పరిధాన చారుధూపములయు సౌరభావలులన్నియుఁ దాల్చి వెడలె నా యనిలుఁ డను దూత. యయాతి మహారాజు జనసవ్వడి విని దేవయానీ శర్మిష్ఠ లున్న తావునకు వచ్చి యుండెను. ఈ వచ్చుట యనునది కేవలము క్వాచిత్కము కావచ్చును. కాని యిప్పట్టున నన్నయగారు తమ కవితా చమత్కృతి నన్నిలుఁ డను దూతను సృష్టించి వానికి సొబగులు గూర్చినారు. తన వర్ణనా కౌశలమును నిరూపించెను 'అతఁడా వాతపరంపరా పరిమళ వ్యాపార లీలన్ జనాన్విత మిచ్చోటనిఁ జేరబోయె' అను మనుచరిత్ర లోని పెద్దన్నగారి కల్పనకుఁ బై వర్ణనయే మార్గదర్శకము. యయాతి దేవయాని నిదివఱకే యెఱుగును. శర్మిష్ఠ యతిశయరూప లావణ్య గుణ సౌందర్యములఁ గాంచి యాకర్షింపఁబడి యామె నెఱుంగ గోరినాఁడు. అందుకు దేవయానియే తాను నాయిక గావునను, శర్మిష్ఠ తన దాసి గావు నను సమాధానము తానే చెప్పినది.

'నన్ను మున్న యెఱుంగు దిన్నాతి నాకు
దాసి వృషపర్వుఁ డను మహాదానవేంద్రు
కన్య నాయొద్ద నెప్పుడుఁ గదలకుండు
ననఘ మరి దీని శర్మిష్ఠ యండ్రు జనులు.

ఇందెంతయో స్వాతిశయము కలదు. నన్ను మున్న యెఱుంగు దఁట. ఇన్నాతి తనకు దాసియఁట. సామాన్యమైన దాసి కాదు. వృష

పర్వుఁ డను మహాదానవేంద్రు కన్య యఁట. తన దాసియే యింత యాధిక్యత గలది యగుచో యజమానియైన తానెంత యధికురాలో యూహింపనగును. మితిమిక్కిలి తనయొద్ద నెప్పుడు కదలకుండునఁట. దీనిని జనులు శర్మిష్ఠ యందురఁట. కాని తాను మాత్రము దాసి యనియే యనును కాబోలును! ఇటువంటి గడుసు పోకడలు, జాణతనముఁ జూపిన దేవయాని శీల చిత్రణమునందు న్యాయము జరుగలే దనవలసి యున్నది.

తన్ను వివాహమాడుమని యయాతినిఁ గోరినది. యయాతి ధర్మవర్తనుఁడు- ధర్మరక్షకుఁడు వర్ణాంతరవివాహ మధర్మము- 'క్షత్రియకన్యకల బ్రాహ్మణులు వివాహంబగుదురుగాక యధర్మోత్తరంబుగా క్షత్రియులు బ్రాహ్మణకన్యకల వివాహంబగుమరే? నీ పలుకులు ధర్మవిరుద్ధంబులు. మఱియు సర్వవర్ణాశ్రమ ధర్మములు సంకరంబులుగాకుండ రక్షించుచున్నయేన యిట్టి యధర్మంబున కొడంబడితినేని జగత్ప్రవృత్తి విపరీతంబగు' ననియె. యయాతి పలుకులు ధర్మసమ్మతములు అయ్యును దేవయాని శాపగ్రస్త-దేవయాని కీవివాహము దక్క యన్యము శరణ్యముగాదు. శుక్రుడీ వివాహమునం దపక్రమదోషంబు లేకుండునట్లు వరమిచ్చి వివాహ మనుమతించె. యయాతియు శుక్రునికి భయమంది యీ వివాహమున కియ్యకొనెను. ఇది గత్యంతరములేని పెండిలియేగాని యిందు ప్రేమాదరములు లేవు. ఇక్కడ నొక విశేషము. శుక్రుఁడు శర్మిష్ఠను జూపి యిట్లు కట్టడిచేసెను. 'ఇది వృషపర్వుని కూతురు, దీనికంత్రియంబున నన్నపానభూషణాచ్ఛాదన మాల్యానులేపాదుల సంతోషంబు సేయునది. శయనవిషయంబున బరిహరించునది' యని. అయినను శర్మిష్ఠ వినయశీల. అతిశయరూపలావణ్యగుణసుందరి. రాచకూతురు. ఆమె యనురాగము ఫలించినది. యయాతి యిది వఱకే యామె రూపలావణ్యగుణసౌందర్యములచే నాకర్షింపబడినాఁడు. యయాతిని చెట్టపట్టినది, ముగ్వురు పుత్రులను కన్నది, తుదకు శర్మిష్ఠ పుత్రుఁడే పూరుం డనువాఁడు రాజ్యార్హుండైనాఁడు. దేవయాని పుత్రులు

రాజ్యార్హతను గోల్పోవుటయేగాక శాపగ్రస్తులైనారు. ఇచ్చట నొకవిశే షము, బ్రాహ్మణ స్త్రీ యందు క్షత్రియునకుఁ బుట్టినవాఁడు శూద్రుఁడగు నని శాస్త్రప్రమాణముగలదు, శూద్రునకు రాజ్యార్హత లేదు. తిన్నవ మానించి శర్మిష్ఠను చెట్టపట్టిన నేరమునకు యయాతిని జరాభార పీడితుఁ డగునట్లు శపింపఁజేసినది. అట్లుచేసి భర్త యనురాగమునకు దూరగురా లైనది. తన యహంకారమునకు, స్వాతిశయమునకుఁ, క్రోధమునకు నుచితానుచితజ్ఞానశూన్యతకుఁ దానే బలియై యన్నివిధముల పరాభూత యైనది. రాచకూతురైన శర్మిష్ఠ వినయశీలయగుటవలన సర్వథా చరితార్థ యైనది.

ఆత్మస్తుతి స్వాతిశయము ననునవి పతనహేతువులు. ఇందుకుఁ దార్కాణము యయాతిమహారాజు. వేదవేదాంగ పారగులైన బ్రాహ్మణుల తోడం దపోవనంబునకుం జని యందుఁ గందమూలఫలాశనుండై వన్యంబు లైన ఫలంబుల హవ్యకవ్యముల నగ్నిభట్టారకుం బితృదేవతలం దనుపుచు వానప్రస్థవిధానంబుఁ దప్పక శిలోంఛవృత్తి, తిథిభుక్తశేషం బుపయో గించుచు నియతాత్ముండై జితక్రోధారివర్గుండునై సహస్రవర్షంబులు దపంబుసలిపి సర్వసంగవిముక్తుండై సర్వద్వంద్వంబులు విడిచి ముప్పది యేండ్లు నిరాహారుండై యొక్క యేడు వాయు భక్షకుండై పంచాగ్ని మధ్యంబున నిల్చి యొక్కయేడు నీటిలో నేకపాదంబుననిల్చి మహా ఘోర తపంబు సేసెను. యయాతి పూరునకుఁ బెక్కునీతులను బోధించెను. శత మఖుఁడు పృచ్ఛింపఁగా తాను పూరునకు బోధించిన నీతుల నిట్లుగా వివ రించెను.

ఎఱుకగలవారి చరితలు నెఱుంగవలె. సజ్జనగోష్ఠి ధర్మంబెఱుగవలె. తానెఱిఁగిన ధర్మమును సమంజసబుద్ధి ననుష్ఠించవలె. పాత్రదానము స్టేయవలె, తాను చేయిజాపరాదు. అభిముఖులైవచ్చిన శరణార్థుల వృథ

పుచ్చరాదు, సభలలో ధర్మయుతముగ పల్కుపల్కులు మనమునకుఁ బ్రియముగను హితముగను పథ్యము, తథ్యము, నమోఘము, మధురము గను మీదు మిక్కిలి పరిమితముగను నుండవలెను. కరుణ, ఆర్జవము, క్షమ,జయము, సత్యంబును, శమము, శౌచము వీనిని మనస్సున నిలుప వలెను. శుద్ధశాంతబుద్ధి యరిషడ్వర్గమును జయించవలె. ఇంద్రుఁడు సంత సిల్లి 'శతసహస్ర వర్షంబులు పుణ్యలోక భోగము లనుభవించితిరి. ఏమి తపం బొనరించితిరో'యని ప్రశ్నించెను. సమాధానముగా యయాతి స్వాతి శయ ముట్టిపడ నిట్లు పలికెను.

సురదైత్య యక్షరాక్షస
నరఖేచరసిద్ధమునిగణప్రవరుల ఖా
సురతపములు నాదగు దు
ష్కరఘోరతపంబు సరియుఁగా వమరేంద్రా!

అని తన తపోఽభిమానంబున మహర్షుల నవమానించి పల్కిన నయ్యింద్రుండు కోపించి వాని నధోలోకగతుంగా శపియించెను. తుదకుఁ గరుణించి నంతరిక్షమున సద్భువనంబున సత్సంగతి నుండునట్లు ప్రసా దించెను. అచట సద్భువన నివాసులైన యష్టకాదులు యయాతిని తమ మాతామహులుగా నెఱింగి వానిం బూజించి, సకల ధర్మాధర్మంబులు, సుగతి దుర్గతి స్వరూపంబులు, జీవుల గర్భోత్పత్తి ప్రకారంబులు, వర్ణా శ్రమ ధర్మములు నెఱుంగవేడిన వారికి యయాతి యాయాధర్మంబులు వివరించెను.

# 5

యయాతి పుత్రుండైన పూరునకుఁ గౌసల్య యను దానికి జనమేజయుండు పుట్టె జనమేజయునకు ననంత యనుదానికిఁ బ్రాచీశుండు పుట్టె, ప్రాచీశునకు నశ్మకియను దానికి సంయాతి పుట్టె, సంయాతికి వరాంగి యనుదానికి నహంయాతి పుట్టె, వానికిఁ గృతవీర్య పుత్రియైన భామమతి యనుదానికి సార్వభౌముండు పుట్టె, సార్వభౌమునికిఁ గేకయరాజపుత్రియైన సునందకు జయత్సేనుండు పుట్టె, జయత్సేనునకు వైదర్భియైన సుశ్రవసకు నవాచీనుండుపుట్టె, వానికి విదర్భరాజ పుత్రియైన మర్యాదకు మహాభౌముండు పుట్టె, మహాభౌమునకుఁ బ్రసేనజిత్తు కూతురైన సుపుష్టకు నయుతానీకుండు పుట్టె-వానికి పృథుశ్రవసుని పుత్రియైన కామకు నక్రోధనుండు పుట్టె, వానికి కాళింగియైన కరంభ యనుదానికి దేవాతిథి పుట్టె, దేవాతిథికి వైదేహియైన మర్యాదకు ఋచీకుండు పుట్టె, వానికి సుదేవయనుదానికి ఋక్షుండు పుట్టె, ఋక్షునకుఁ దక్షకపుత్రియైన జ్వాల యనుదానికి మతివరుండు పుట్టె, అతఁడు సరస్వతీ తీరమ్మునఁగడు నిష్ఠతోఁ బండ్రెండేండ్లు సత్రయాగము సేసి ఆమెకడు ననురక్తయయి మతివరుని పతిగాఁ జేసికొనిన వారికిఁ దసుండు పుట్టె. ఆత్రసునకుఁ గాళింది యనుదానికి నీలినుండు పుట్టె, వానికి రథంతరి యనుదానికి దుష్యంతుఁడు పుట్టె.

ఆదుష్యంతుఁ డనంతసత్త్వుఁడు సమస్తాశాంత మాతంగ మ
ర్యాదాలంకృతమైన భూవలయ మాత్మాయత్తమై యుండఁగా
నాదిత్యాంశు సమీరదుర్గమ మహోగ్రారణ్య దేశాళితో
నాదిక్షత్ర చరిత్ర నేలె నజితుండై బాహువీర్యంబునన్.

ఆదుష్యంతుండు మృగయా వినోదార్థియయి యరణ్యమునకు వెడ లెను. ఆదిత్య హయంబులకంటె వాఁడియైన హయంబులఁ బూన్చిన రథంబుపై గజరథతురగ పదాతి చతుర్విధ బలంబులువెంటరా సపరివా రంబుగా వెడలె. వనంబున బహుదూరంబు చనిన నాతని రథవేగంబు ననుగమింపనోపక యధికక్షుత్పిపాసాపరవశులయి పదాతు లాయా ప్రదేశ ముల విక్రమించిరి. దుష్యంతుఁడును కతిపయామాత్యపరిజన పురోహిత సహితుండై కొండొక నేలయరిగి యొక్కనదీ తీరంబునఁగల వనంబు సొచ్చె ఆతండు వనంబు సొచ్చునప్పుడు 'లతాలలనన్ మృదులానిలాప వర్జిత కుసుమాక్షతావళులు సేసలు వెట్టినట్టిరైరి' అనఁగా మెల్లనిగాలిచేత విదల్చఁబడిన పువ్వులనెడియక్షతలు సేసలు పెట్టినట్లైనదఁట- అదియును సంపతదళిసీనినాద మృదుభాషల దీవనలిచ్చుచున్ సేసలు పెట్టినట్లైనది. ఈ దీవనలిచ్చుట, సేసలు పెట్టుట యననవి వివాహ సందర్భమున జరుగు తంతు. అవి భావ్యర్థ సూచన. శకుంతలా దుష్యంతుల వివాహ మిందు సూచితము.

అతండు వనంబున బహుదూరంబు చనె, చని చని ముందట యవ్వనంబులో నరిగి యరిగి యనుటవలన దుష్యంతుఁడు వనంబులోఁ జాలదూరము వోయినట్లు తెల్లము.

కణ్వమహామునికి నమస్కరించు కొఱకుఁ దానొక్కరుండ యాశ్ర మంబుఁ బ్రవేశించి శకుంతలనుఁ జూచెను. ఆమెయు నాగతుని దుష్యం తుగా నెఱింగి యతి సంభ్రమంబున నాసనార్ఘ్యపాద్యాది విధులం బూజించి కుశలం బడిగెను. వానిని దుష్యంతుగా నెట్లెఱింగెనో చెప్పబడలేదు. దుష్యంతుడు తన రాకకుఁ గారణ మిట్లుగాఁ జెప్పెను.

క్రచ్చర వేఁట వచ్చి యిఁట కణ్వమహామునిఁ జూచి పోవఁగా
వచ్చితి యెందుఁ బోయిరొకొ వా రనినన్ విని యాలతాంగి వా

రిచ్చటి నుండి యీ క్షణమ యేఁగిరి కానకుఁ బండ్లుదేర మీ
వచ్చు టెఱింగిరేని జనవల్లభ వారును వత్తు రింతకున్.

వారు వచ్చునంతకు నొక్క ముహూర్తం బుండునది యనిన యా క్కోమలి వినయంబునకు మృదుమధుర వచనంబునకు సంతసిల్లి దానిం గన్యగాఁ నెఱింగి మనోజ రాజ్యలక్ష్మియుంబోని దాని సర్వలక్షణ లక్షితంబులయిన సర్వావయంబులఁ జూచి సంచలిత హృదయుండై నీ వెవ్వరి కూఁతురవని పృచ్ఛించెను. అంత నన్నాతి తన జన్మవృత్తాంతము వివరించెను- కణ్వమహాముని యొక్క మునివరునకుఁ జెప్పఁగాఁ దాను వినిన విధంబును వివరించెను. మహా తపోనిష్ఠాగరిష్ఠుఁడైన విశ్వామిత్ర మహర్షి తపోభంగము సేయ సమకట్టి మేనక యను నప్సర యింద్రుని పనుపున ముని పాలికి వచ్చి

అలసత యొప్పఁగా దరుణి యమ్మని వల్లభు మ్రోలనున్న స
మ్మిళిత సుగంధ బంధుర సమీర వశంబునఁ దూలి బాల పై
వలు వెడలన్ బయల్పడియె వల్ద కుచంబులుఁ గక్షయుగ్మమున్
లలిత కృశోదరంబుఁ దరళ త్రివళీకృత రోమ రాజియున్.

హరి హరీ! యని కన్నులు చెవులు మూసికొనవలెను. ఇఁట శృంగారము పతాకస్థాయికిఁ జేరుకొన్నది. గాలిచేత బాల పైవలువ తొలఁగెనట. అప్పుడు కుచంబులు, కక్షయుగ్మము, లలిత కృశోదరము చివరకుఁ దరళ త్రివళీకృత రోమరాజియు నొకదాని పిమ్మట నొకటి నవ రోహణ క్రమములో బయల్పడెనఁట. శకుంతల తన తల్లిదండ్రులైన మేనకా విశ్వామిత్రులఁ బ్రణయమునుఁ బ్రస్తావించు తఱి నదియును దుష్యంతుని మ్రోల నిట్టి వర్ణనౌచిత్యము విచారింపఁ దగియున్నది.

స్త్రీకి జనకుండు, నన్నప్రదాత, భయత్రాత యన ముప్వురు గురువులు. కణ్వమహర్షి శకుంతలకు భయత్రాత యగుటం జేసి గురువ

య్యెను. ఆమె కణ్వమహర్షి చేత నభివర్ధిత యగుటం జేసి కూఁతురయ్యె. పురుషున కుపనేత నిరంతనాధ్యాపకుండు నన నిర్వురు గురువులు. దుష్యంతుఁడు శకుంతలను వివాహమాడఁ గోరెను. బ్రాహ్మంబు, దైవంబు, నార్షంబు, ప్రాజాపత్యంబు, రాక్షసము, నాసురము, గాంధర్వము, మఱియుఁ బైశాచము నను నష్టవిధ వివాహముల వివరించి యందు రాక్షసము, గాంధర్వము నను నవి సత్క్షత్రియ వంశజులకు నుత్తమము లని వక్కాణించెను. దుష్యంతుఁడు గాంధర్వ విధి శకుంతల నుద్వాహమగుట, నిష్ట భోగంబు లనుభవించి చనుట, శకుంతలా గర్భంబున భరతుఁడు జన్మించుట మున్నగా గలవి కథాంశములు.

భారతము నీతిశాస్త్ర సర్వస్వము. ఇందుఁ జెప్పబడని నీతులులేవు. ఇందు నిల్లాంద్ర కెన్నియో నీతులు సెప్పఁబడినవి. భారతమునఁ జెప్పఁబడిన నీతిబోధకములు సర్వకాలము లందును శిరోధార్యములు; ననుల్లంఘనీయములు.

కణ్వుండు శకుంతలను దుష్యంతుఁ బాలికిఁ బంపనెంచి కూఁతున కిట్లనియె.

ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లను
పెద్దకాల మునికి తద్ద తగదు
పతుల కడన యునికి సతులకు ధర్మువు
సతుల కేడుగడయుఁ బతుల చూవె.

తన యొద్దకు వచ్చిన శకుంతలనుఁ దుష్యంతుఁడు దా నెఱుంగ ననియె.

వన కన్యక యఁట నే నఁట
వనమున గాంధర్వమున వివాహం బఁట నం

దను గనెనట మరచితి నఁట
వినఁగూడునె యిట్టి భంగి విపరీతోక్తుల్?

దుష్యంతు సమక్షంబున నెన్నియో నీతిశాస్త్ర, ధర్మశాస్త్ర విషయములను శకుంతల ప్రబోధించినది.

సతియును గుణవతియుఁ బ్రజా
వతియు ననువ్రతయు నైన వనిత నవజ్ఞా
న్వితదృష్టిఁ జూచు నతి దు
ర్మతి కిహముం బరముఁ గలదె మతిఁ బరికింపన్.

భార్య ధర్మార్థ సాధన కుపకరణము, గృహనీతి విద్యకు గృహము. విమల చారిత్ర శిక్ష కాచార్యకము అన్వయ స్థితికి మూలము. సద్గతికి నూఁత, గౌరవంబున కేక కారణంబు. ఉన్నత స్థిర గుణమణుల కాకరము. హృదయ సంతోషమునకు సంజనకంబు. మఱియు భార్య పురుషునం దర్ధం బగుటం జేసి పురుషునకు మున్న పరేత యయిన పతివ్రత పరలోకంబునం దనపురుషుం గూడఁ దదాగమనంబుఁ బ్రతీక్షించుచుండు. పురుషుండు మున్న పరేతుండైనఁ బదంపడి తానును పరేతయై తన పురుషుం గూడ నరుగు. అట్టి భార్య నవమానించుట యధర్మంబు. పురుషుండు భార్యయందుఁ బ్రవేశించి గర్భంబునఁ బుత్త్రుండై తాన యుద్భవిల్లు. కావున 'నఙ్గా దఙ్గా త్సమ్భవసి' యనునది యాదిగాఁగల వేదవచనంబుల యందు జనకుండును పుత్త్రుండు నను భేదంబులేదు.

విను గార్హపత్యమను న
య్యనలము విహరింపఁబడి తదాహవనీయం
బన వెలుఁగునట్లు వెలుఁగును
జనకుఁడు తాఁ బుత్త్రుఁడై నిజ ద్యుతితోడన్.

తాను తన నీడ నీళ్ళల
లో నేర్పడఁ జూచునట్లు లోకస్తుత త
త్సూను జనకుండు సూచి మ
హానందముఁ బొందు నతిశయ ప్రీతిమెయిన్.

'పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్త్ర' యను వేదవచనంబుఁ గలదు. కావున పుణ్యాచారుండైన పుత్త్రుండు నుభయ పక్షంబుల వారి నుద్ధరించును. ఇంతియఁ గాక సత్యవ్రత మాహాత్మ్యము లెస్సఁగా వక్కాణింపఁ బడినది.

నుత జల పూరితంబులగు నూతులు నూటిటి కంటె సూనృత
వ్రత యొక బావి మేలు మఱి బావులు నూటిటి కంటె నొక్క స
త్క్రతువది మేలు తత్క్రతు శతంబున కంటె సుతుండు మేలు త
త్సుత శతకంబు కంటె నొకసూనృత వాక్యము మేలు చూడఁగన్.

వెలయంగ నశ్వమేధం
బులు వేయును నొక్క సత్యమును నిరుగడలం
దుల నిడి తూఁపఁగ సత్యము
వలనన ములు సూపు గౌరవంబునఁ బేర్మిన్.

సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁగావ
యెఱుగు మెల్ల ధర్మంబుల కెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు.

తుదకు నాకాశవాణి పలుకులు విని భరతుని దుష్యంతుఁడు చేకొనియె. అన్యునెఱుగమిఁజేసి లోకాపవాదభీతి నిత్తన్వి నెఱుంగనంటి యని వాఁడు. ఇందౌచిత్యము లేదు దూడ గడ్డికొఱకుఁ గొబ్బరిచెట్టెక్కినట్లు

న్నది. ధీరోదాత్తుఁడైన నాయకుఁడు కేవలము లోకాపవాదమునకు వెఱచి తాను గాంధర్వవిధివివాహమాడిన భార్యనుఁ దానెఱుగననుట తగదు కనుకనే కాళిదాస మహాకవి శాకుంతలము నాటకమున దూర్వాసమహాముని శాపము - దుష్యంతుఁ డొసంగిన యంగుళీయకమును చేప మ్రింగుట- శకుంతలాదుష్యంతుల సంవాదము జరుగుచుండఁగా జాలరులాయంగుళీయ కమును దెచ్చుట-తన్మూలమున దుష్యంతునికిఁ బూర్వస్మృతి కలుగుట మున్నగు కథాంశములు చేర్పఁబడుటతో నౌచిత్యము పోషింపఁబడినది.

# 6

భరతునకుఁ గైకేయి యయిన సునందకు భుమన్యుండు పుట్టె. వానికి దశార్హ పుత్రియైన విజయకు సుహోత్రుండు పుట్టె. వానికి నిక్ష్వాకు కన్యయైన సువర్ణకు హస్తి పుట్టె. ఈ హస్తిపేరనే కౌరవ రాజధానియైన హస్తినాపురము నిర్మితమయ్యెను. ఈ హస్తికిఁ ద్రిగర్త రాజపుత్రియైన యశోధరకు వికుంఠనుండు పుట్టె. వానికి దశార్హపుత్రియైన వసుదేవకు నజమీఢుండు పుట్టె. అయ్యజమీఢునకు మువ్వురు పుత్రికలు నూట యిరు వది నాలుగుమంది పుత్త్రులు పుట్టిరి. వారిలో సంవరణుఁడు రాజయ్యెను. అతఁడు సూర్యతనయయైన తపతిని వివాహంబైన కౌరవవంశకరుండయిన కురుండుపుట్టె. వానిపేర కురుక్షేత్రమయ్యె. కురునకు దశాంగపుత్త్రి యైన శుభాంగికి విదూరుండు పుట్టె. వానికి మాధవియైన సంప్రియకు ననశ్వుండుపుట్టె. అనశ్వునకు మాగధియైన యమృతకుఁ బరీక్షితుండుపుట్టె. వానికి బహుదానసుతయైన సుయశకు భీమసేనుండుపుట్టె. వానికిం గైకేయి

యయిన కుమారికిఁ బ్రతిశ్రవసుండు పుట్టె. వానికిఁ బ్రతాపుఁడు పుట్టె. అట్టి ప్రతాపునకు శంతనుండు పుట్టి రాజయ్యెను.

వశిష్ఠుచే శాపగ్రస్తులైన యష్టవసువులు గంగాశంతనులయందు జన్మించిరి. వారు మర్త్యలోకంబునఁ బెక్కు కాలం బుండకుండునట్లు పుట్టిన వారిని పుట్టినట్లు గంగలోవైచె-వారిలో నొక్కొక్కళ్ళ తురీయార్థంబుదాల్చి యష్టమవసువు దీర్ఘాయుష్మంతుడై జన్మించెను. అతఁడే దేవవ్రతుఁడు-పెరిగి పెద్దవాఁడై భీష్ముఁడయ్యెను. ఆతండు సత్యవతీ సూనుండైన విచిత్రవీర్యునికి కాశీరాజు పుత్త్రికలైన యంబిక,యంబాలికల వివాహంబు జరిపించెను. విచిత్రవీర్యుండు సంతాన హీనుండై మరణించెను. కౌరవ వంశము నిల్పుకొఱకు నంబిక యంబాలికల యందు సంతానోత్పత్తి కొఱకు సకల ధర్మవేత్తయయిన భీష్ముండు దేవరన్యాయంబు రూపించె. అందులకే క్రింది ప్రమాణముల నుదాహరించె.

పితృవధజాతకోప పరిపీడితుఁడై జమదగ్నిసూనుఁ డు
ద్ధతబలు హైహయున్ సమరదర్పితుఁ జంపి యశేషధారుణీ
పతులను జంపె గర్భగతబాలురు నాదిగ నట్టిచోటఁ ద
త్సతులకుఁ దొల్లి ధర్మవిధి సంతతి నిల్పరె భూసురోత్తముల్?

మఱి యదియుంగాక యుపచథ్యుండను మునివరుపత్ని మమత యను దాని గర్భిణి నభ్యాగతుండయి బృహస్పతి దేవరన్యాయంబున నభిలషించినఁ దదీయగర్భస్థుండైన పుత్త్రుండెఱింగి యిది ధర్మవిరుద్ధంబని యాక్రోశించిన వానికి నలిగి సర్వభూతేప్సితంబైన యిక్కార్యంబునందు నాకుఁ బ్రతికూలుండవయితివి కావున దీర్ఘతమంబును బొందుమని శాపంబిచ్చెను. ఇందు ధర్మము లేశమాత్రమును లేదు గర్భిణి నభిలషించుట యెట్టి వారికిఁ గాని పాపహేతువు. దీర్ఘతముఁడు జాత్యంధుఁడయ్యెను ప్రద్వేషిణియను బ్రాహ్మణ కన్యక నుద్వాహంబయి దానియందుఁ

బెక్కండ్రుసుతులను కనెను. ప్రద్వేషిణి జాత్యంధుడును, ముదుసలియైన దీర్ఘతముని రోసి వాని నెందేని పాఱవేయఁ బుత్త్రుల నియోగించెను. తల్లి పనుపున వారు దీర్ఘతముని నింధనములతో బంధించి గంగలోఁద్రోచిరి. దీర్ఘతముండును ప్రవాహ వేగంబునఁ బెక్కుదేశంబులు గడచి చనియె. ఒక్కనాఁడు బలియను రాజు గంగాభిషేకంబునకు వచ్చినవాఁడు, నయ్యింధన బంధంబుననుండి యుదాత్తానుదాత్త స్వరితప్రచయభేదంబు లేర్పడ లక్షణంబుగా వేదంబులంజదువుచుఁ దరంగ ఘట్టనంబున బలిసమీపంబునఁ జేరెను. ఆతండు దీర్ఘతముని సంభావించి తానపుత్త్రకుం డగుటంజేసి సంతాన దానంబు సేయ వేడెను. ఋతుమతి యయిన తనదేవేరి సుదేష్ణను సంతానమువడయ నియోగించెను. దీర్ఘతముఁడు బుట్టుజీకు. వృద్ధుడు. విభూతి గంధాననుఁడు - వేదజడుఁడు - వానిని సుదేష్ణరోసి తన్నుబోలిన దాసి కూతును సంతానము వడయ తనకు మాఱుగా నియోగించెను. ఆ దీర్ఘతముఁడు దానియం దేకాదశ పుత్త్రులఁబుట్టించె. బలియును కలరూపెఱింగి, మఱల సుదేష్ణను నియోగించిన దానియందు నంగరాజను రాజర్షి పుట్టె. ఇవ్విధఁబున నుత్తమక్షత్రియక్షేత్రంబులయందు ధర్మమార్గంబున బ్రాహ్మణ వీర్యంబులబుట్టి వంశకరులైన క్షత్త్రియులనేకులు కలరని దేవవ్రతుండు నిరూపించె- ఆలాగుననే యంబిక యంబాలికల యందు ధృతరాష్ట్ర పాండు రాజులును దాసియందు మాండవ్యశాప వశంబున యమధర్మరాజు శూద్రయోనియందు విదురుండుగా వ్యాస భగవానుని వీర్యంబున నుద్భవిల్లిరి.

# 7

అంబికయందు వేదవ్యాసుని యనుగ్రహమునఁ బుట్టిన ధృతరాష్ట్రుఁడు గాంధారి నుద్వాహమయ్యెను. ఆమెయు హరుచేత శతసుతులఁబడయ వరముఁ బొందియుండెను. ఆమెయు పరమపతివ్రత యగుటవలన పరపురుష సందర్శనంబు పరిహరించి నేత్రపటంబుఁ గట్టికొనియె- ధృతరాష్ట్రుండును దానితోఁబుట్టిన కన్యకల పదుండ్రు సత్యవ్రతయు, సత్యసేనయు, సుదేష్ణయు, సంహితయుఁ, దేజశ్శ్రవసయు, సుశ్రవయు, నికృతియు, శుభయు, సంభవయు, దశార్ణవయు ననువారల నేకలగ్నంబున నుద్వాహమయ్యె, కులరూపశీలములుగల దేవీశతంబునుగూడ వివాహమయ్యెను. కుంతిభోజుపుత్రి దూర్వాస మహాముని వరప్రభావంబున సూర్యభగవాను నారాధించి కర్ణుని పుత్రుగాఁ బడసెను. మహాభారతమునందు దేవరన్యాయంబునఁ బరపురుష సంపర్కమున నుత్తమస్త్రీలు సంతానవతులగుటయందుఁగల ధర్మాధర్మ ప్రశంస పెక్కుచోట్ల కలదు. ఆనవరతకామాసక్తివలన రాజయక్ష్మ కలుగునని భారతమునఁ గలదు.

అతిశయ రూపయౌవన గుణాధిక సుందరరమైన యాసతీ
ద్వితయమునందు సంతతరతిన్ వివశుఁడయి రాజకృత్యముల్
మతి నొకనాఁడు జేయక హిమద్యుతితేజుఁడు రాజయక్ష్మబా
ధితుఁడయి దేవలోక సుదతీప్రియుఁ డయ్యె విచిత్రవీర్యుడున్.

అట్లే వ్యషితాశ్వుండను మహారాజు కాక్షీవతి యయిన భద్రయను తన భార్యయం దనవరత కామాసక్తింజేసి యక్ష్మరుజా క్రాంతుఁడై

యస్తమించెను. పాండురాజు శాపగ్రస్తుండయి తన స్వభార్యలయందు సంతానవంతుఁడు గాఁజాలఁడయ్యెను. అతఁడు తనకౌఱకు దేవరన్యాయంబున క్షేత్రజుల బుత్త్రిలఁగాఁబడయ కుంతి నుద్బోధించిన విధంబెట్లన ఔరసపుత్త్రుండు కడుంగడు నుత్తముండు. ఔరసుని తరువాత నుత్త మునిగాఁ బేర్కొనఁదగినవాఁడు క్షేత్రజుఁడు. అయ్యును దేవరన్యాయ జాతుండైన క్షేత్రజుం డుత్తమోత్తముండు. పూర్వకాలమున స్త్రీలు పురుషులచే ననాదృతలై స్వతంత్రవృత్తి నఖిలప్రాణి సాధారణంబయిన ధర్మంబునం దమదమ వర్ణంబులందు ఋతుకాలముఁ దప్పక నియతాని యతలై ప్రవవర్తిల్లుచుండెడి వారఁట. పూర్వముద్దాలకుండను మహా తపో నిధి కలఁడు. అతనిభార్య పరమసాధ్వి. అధిక తపోనిధియైన శ్వేతకేతువు వారి పుత్రుఁడు. శ్వేతకేతువు ఋతుమతియైన దాని నొక్క వృద్ధవిప్రుం డతిథియై వచ్చి పుత్త్రార్థము కామించెను. దానికి శ్వేతకేతుం డలిగి యిదిధర్మ విరుద్ధంబని పరపురుష సంగమంబు సాధ్వులకు మహాపాపంబుగాఁ గట్టడి చేసెను. మఱియుఁ బాండురా జిట్లనియె. పతి నియోగించిన దానిం జేయని నాఁడు భార్యకుం బాతకంబని యెఱింగికాదే కల్మాషపాదు డను రాజర్షిచేత నియుక్తయైన వానిభార్య మదయంతి వశిష్ఠువలన నశ్మకుండను పుత్త్రు బడసె. అస్మజ్జన్మంబును నిట్టదే యని వాక్రుచ్చె. కుంతియు నింద్రాదిదేవతల నారాధించి ధర్మభీమార్జును లను కొడుకులను బడసె. అట్లే మాద్రియు నశ్వినీ దేవతల నారాధించి నకులసహదేవులను కొడుకులను బడసెను.

తరువాతఁ బేర్కొనఁదగినది తపతీసంవరణోపాఖ్యానము. పాండవులు ద్రౌపదీ స్వయంవరణార్థము నరుగువా రొక నర్ధరాత్రమున భాగీరథీ తీరమునుఁ దాకిరి. అచట సోమశ్రవంబను తీర్థంబున స్నానార్థులైఁబోవ యంగారపర్ణుఁడను గంధర్వుఁడు భార్యాసమేతుఁడై జలక్రీడార్థ మేతెంచి పాండవుల పాదధ్వని విని యలిగి వారల నడ్డగించెను. ఈ సందర్భమున నర్జునుఁడు భాగిరథీ మాహాత్మ్యంబు నిట్లుగాఁ గొనియాడెను.

హైమవతోత్తుంగ హేమ శృంగంబున
నుండి భూమికి వచ్చి యుదధిఁ గూడె
గంగ నా నేడు తెలుంగుల నదియు మం
దాకినినా సత్పథంబు నందు

సురసిద్ధముని వియచ్చర సేవ్యమయ్యె న
య్యధమ లోకంబుల యందు భోగ
యన నొప్పె నున్నతి నిట్లు త్రిభువన
పావనయైన యప్పరమమూర్తిఁ

బార్వతీశ మకుట బంధబంధుర తరా
వాస గంగ నాడ వచ్చి నీవు
వలవ దనిన నుడుగు వారము కాదు నీ
విఘ్న వచనములకు వెఱతు మెట్టు?

అని యంగారపర్ణుని ధిక్కరించెను. నీవు వలవ దనిన నుడుగు వారము కామని ఖండితముగాఁ జెప్పెను. నీ బిభీషికలకు నిక్కడ నడలు వారు లేరని వానిపై నలిగి యాగ్నేయాస్త్రముఁ బ్రయోగింపఁగా వాని రథము దగ్ధమయ్యె. అంగారపర్ణుఁడును మూర్ఛిల్లె. వాని పత్ని పతిదానము సేయ ధర్మరాజును బ్రార్థింపఁ ధర్మజుని పనుపున పార్థుంకు నంగార పర్ణుని విడిచిపుచ్చెను. అంగారపర్ణుఁడు పాండవులకుఁ గొన్ని నీతివాక్యముల నుపదేశించెను. మహీపతి మహీసురపురస్సరుండగునేని నెల్ల యుద్ధముల శత్రుల జయించు. సర్వ శుభంబులు గల్గు. ఇంతులగోష్ఠి నున్న వాఁడు పెక్కు నిడుమల పాలగు.

ఇంతులగోష్ఠి నున్న యతఁ డెంత వివేకము గల్గె నేని య
త్యంతమదాభిభూతుఁడగు ధర్మవు దప్పు బ్రియం బెఱుంగఁ దే

నెంత వివేకి నయ్యును సహింపక యింతుల యొద్దఁ బల్కితిన్
వింతయె కామశక్తి యుడిగింపఁగ శక్యమె యెట్టివారికిన్,

సురగరుడ విషోరగ య
క్ష రాక్షస పిశాచ భూత గంధర్వులు నో
పరు ధిక్కరింప బ్రాహ్మణ
బురస్కృతులఁ బుణ్యమతుల భూతలపతులన్.

మహీపతి కొలువులో ననవద్యుఁడు, వేదవేదాంగ విశారదుడు, జప హోమ ప్రశస్తుడు, సత్య వచనుడు, వర్గచతుష్టయ సాధన సఖుఁడు, సూరి సేవ్యుఁడు, విప్రోత్తముడు నైన పురోహితుఁ డెంతేని శుభమునుఁ గూర్చును. బ్రహ్మచర్యస్థుఁ డైన పీరునికి మన్మథార్తుఁ డైన కామోప భోగనిరతుఁ డోటువడుట తథ్యము. ఇంతయేల?

వేదము వేదియుం గలుగు విప్రవరేణ్యుఁ డగణ్య పుణ్య సం
పాది పురోహితుండయినఁ బాపము పొందునె? భూపతిం బ్రతా
పోదయ! కాన మీదగు గుణోన్నతికిందగ ధర్మతత్త్వ సం
వేదిఁ బురస్కరింపుడు పవిత్రచరిత్ర మహీసురోత్తమున్.

అని యుద్బోధించినాఁడు.

సందర్భ వశమున పార్థునిఁ దాపత్యునింగాఁ బేర్కొనినాడు. పార్థుండు తానెట్లు తాపత్యుఁ డయ్యెనో యెఱుంగ వేడిన సమాధానముగా తపతీ సంవరణోపాఖ్యానము వివరించినాడు. తపతి యాదిత్యుని తనూజ. సావిత్రికి ననుజ. సంవరణుఁ డను రాజు తపతినిఁ జూచి మోహించెను. ఆమె నుద్వాహమాడఁ గోరి సంవరణుఁడు పెక్కు కాలము సూర్యు నారాధించెను. ఆయన పురోహితుండైన వశిష్ఠుఁడు సూర్యు నారాధించి సూర్యు

పుత్త్రియైన తపతిని సంవరణునికిఁ బత్నిగాఁ దోడ్కొని తెచ్చెను. తపతీ సంవరణులకుఁ గురువంశకరుండైన కురుండు పుట్టెను.

వశిష్ఠుని మాహాత్మ్యమును నిఁట సంవరణుఁడు లెస్సఁగా వక్కాణించెను. వశిష్ఠ విశ్వామిత్రుల వైరకారణము. కల్మాషపాదుని వృత్తాంతము. అతఁడు వశిష్ఠ తనయుఁడు, మహానిష్ఠాగరిష్ఠుఁడైన శక్తి నతఃకరించి శాపగ్రస్తుఁ డగుట, శాప విమోచనము, శాపానుభవంబున కల్మాష పాదుఁడు శక్తిని సంహరించుట. శక్తి భార్యయయిన యదృశ్యవంతి యందుఁ బరాశరు డుదయించుట మున్నుగా గల కథాంశములు ప్రస్తావ్యములు.

విశ్వామిత్ర మహారాజు వశిష్ఠుని హోమధేమవును బలాత్కారముగా గ్రహింప దౌర్జన్యము సలిపెను. ప్రలోభ పెట్టెను. హోమధేనువు కొఱకు లక్ష ధేనువులను రాజ్యమును నీయఁ జూపెను. అంత ధనము నట్టి రాజ్యముం గొన నగునయ్య ఇ 'చ్చిడిపికుట్టి' కి యనెను. ఆయన హోమ ధేనువు 'చిడిపికుట్టి' యఁట. అల్పమైన పాడి యావను భావమున నీ ప్రయోగము తెనుఁగు నుడికారమునకు మచ్చు తునక. దౌర్జన్యము సలిపి నపుడు.

పరుల వలన బాధ వొరయకుండఁగ సాధు
జనుల ధనము గాచు జనవిభుండు
కరుణ దప్పి తాన హరియించు వాఁ డగు
నేని సాధులోక మేమి సేయు?

అని కవి వాపోయినాడు.

వశిష్ఠ పౌత్రుండును, శక్తి పుత్త్రుండును నైన పరాశరుండు రాక్షస భక్షణంబునం దన జనకుని బంచత్వంబు తల్లి వలన విని కోప దహన

దందహ్యమాన హృదయుండై తన తపో మహత్వంబున నఖిల లోక సంహారంబు సేయుదునని యున్న మనుమని వారించి వశిష్ఠుం డిట్లనియె. పూర్వము కృతవీర్యుఁ డను రాజు కలఁడు. అతఁడు పెక్కు యజ్ఞములు సేసి విపరీతమయిన ధనరాసులను భృగువంశీయు లైన బ్రాహ్మణుల కొసంగెను. కృతవీర్యుని వంశమువారు ధన లోభమున భృగువంశము వారినిఁ బెక్కు హింసల పాలొనరించిరి. కాని కొందఱు భృగువంశీయులు ధనము నీయక తమ యిండ్లలోఁ బాఁతిపెట్టిరి. అంత నా క్షత్రియులు భార్గవుల నెల్ల నిగ్రహించి వారి గర్భంబుల నున్న యర్భకుల సహితము వధియించిరి. అందొక్క భృగుపత్ని భయంపడి తన యూరు దేశంబున గర్భంబు ధరియించిన దానిని భేదింప సమకట్టిరి. అప్పు డందుండి తీక్ష్ణ మైన ప్రకాశము గల యౌర్వుండు పుట్టె. వాని కాంతినిఁ జూడఁజాలక క్షత్రియు లెల్లరు అంధులైరి. వారును ప్రార్థింప వారలఁ గరుణించి దృష్టి దానము సేసెను. తన పితృదేవత లెల్ల మృతిచెందుటకు వగచి సకలలోక ప్రళయార్థంబు ఘోర తపంబు సేయఁ దొడగిన , వాని పితృ దేవతలు వారింపఁ దన మహోగ్రకోపవహ్ని జలధి యందు విడచె. అయినను పరాశరుండు వశిష్ఠ హితవచనంబులఁ గోపం బుపసంహరించియు, . రాక్షస వినాశార్థముగా సత్త్రయాగము సమకట్టి తుదకు బులస్త్యాది మహాముని గణ ప్రార్థితుండై రాక్షస సత్త్రయాగం బుపసంహరించి త న్నియోగంబున నయ్యగ్నిని హిమవదుత్తర ప్రాంతమున వైచె.

ఇ ట్లంగారపర్ణుండు తాపత్య, వశిష్ఠ, ఔర్వోపాఖ్యానంబు లుపదేశించి పాండవులకు ధౌమ్యునిఁ బురోహితులుగా నిర్దేశించె.

# 8

పాండవులు ద్రౌపదీ స్వయంవరమునకుగాను ద్రుపదుపురంబున కరిగిరి. పార్థుండు మత్స్యయంత్రమునుఁ గొట్టెను. అపు డందరు నచ్చెరు వందిరి.

ఫలపవనాంబుభోజన శుభవ్రత వృత్తులఁజేసి చూడ దు
ర్బలతనులయ్యు బ్రాహ్మణు లపారతపోబల సంపదన్ మహా
బలయుతు లట్టివారలకు భవ్యుల కెందు నసాధ్య మెద్దియుం
గలదె చరాచరాఖిల జగంబులఁ బెద్దల కారె సద్విజుల్.

సద్విజుల యుత్కృష్టత మఱొక్కమా ఱుద్ఘాటింపఁబడియెను. పాండవులు ద్రౌపదిం దోడ్కొని తల్లియొద్ద కేతెంచి మేమొక్క భిక్ష తెచ్చితి మని చెప్పిరి. కుంతియు నెప్పటియట్ల మీరేవురు వినియోగింపుఁడని కొడుకుల నియోగించె, ద్రుపదుండు వీరల కులగోత్రనామము లెఱుంగఁ గోరి పురోహితులఁ బంచె. వారికి ధర్మరాజొసంగిన సమాధాన మెంతయు లౌక్యముగను, యుక్తియుక్తముగను గలదు.

ఇవ్వైహాయస లక్ష్యం
బివ్విల్లు మోపెట్టి నెట్టనేసిన వీరుం
డివ్వనితకు వరుఁడగు నని
యెవ్వగ మీరాజు చులుక నియమము చేసెన్

అతఁడు నియమించినట్లు యయ్యంత్ర మేసి
యీతఁ డీ కన్యఁ బడసె నుర్వీశులొద్ద
నేల తా మమ్ము నెఱఁగెడు నెఱిఁగి యేమి
సేయువాఁ డింక మీపతి సెప్పుమయ్య.

బలహీనుఁడైన వానికి
నలవియె మోపెట్టి తివియ నక్కార్ముకముం
గులహీనున కకృతాస్త్రున
కలవియె యా లక్ష్యమేయ నశ్రమ లీలన్.

ద్రుపదుండును మిక్కిలి యుక్తియుక్తముగా చాతుర్వర్ణ్యోచితంబులైన రథంబులఁ బంచిన పాండవులు క్షత్రియోచితంబయిన రథంబు నధిరోహించి చనిరి. వారల రాజపుత్రులఁగా నెఱింగెను. ద్రౌపదిని పాండవులేవురు వివాహమగుదురని ధర్మజుఁడు ద్రుపదునికిఁ జెప్పినంత నాతఁడు విస్మితుండై.

ఒక్కపురుషునకు భార్యలు
పెక్కండ్రగు టెందుఁ గలదు పెక్కండ్రకు నా
లొక్కత యగు టే యుగముల
నెక్కడఁ గలమ వినియు నెఱుఁగ మెవ్వరివలనన్.

ఈ చర్చా సందర్భమున వ్యాసభగవానుఁ డవతరించె. కృష్ణ ద్వైపాయను సమక్షంబున ధర్మజుండీ ధర్మసంశయనివృత్తి కొఱకు నొక్క కన్యకను పలువురు చెట్టపట్టిన వృత్తాంతములను ప్రమాణముగా నుదహరించెను. జటిలుఁడను ఋషి కూతురు తపఃప్రభావంబున నేడ్వురు ఋషులకు నొక్కతియ భార్యయగుట నొకటి. దాక్షాయణియను మునికన్యక యేకైకనామంబున ప్రచేతసులనంబరగిన బదుండ్రకు నొక్కతియ భార్యయగుట.

శ్రూయతే హి పురాణేషు జటిలా నామ గౌతమీ
ఋషీనధ్యాపితవతీ స ప్త ధర్మభృతాం వరా
తథైవ మునిజావార్క్షీ తపోభిర్భావితాత్మనః
సంగతాభూద్దశభ్రాతౄ నేకనామ్నః ప్రచేతసః.

అని మూలము.

కృష్ణద్వైపాయనుండును ద్రౌపదిని పాండవు లేవురకు వివాహం బొనర్పుమని యాదేశించి ద్రౌపది పూర్వజన్మ వృత్తాంతము వివరించె.

పూర్వము నాలాయనియైన యింద్రసేన మహాపతివ్రత మౌద్గల్యుం డను మహాముని భార్య. కర్మవశంబున మౌద్గల్యుండు కుష్ఠవ్యాధి బాధిత త్వగస్థిభూతకుష్ఠ శరీరుఁడు. వయోవృద్ధుఁడు. వలిపలితధరుఁడు దుర్గంధ వదనుఁడు. దుఃఖజీవుఁడు. అతికోపనుఁడు. అయ్యును నామౌద్గల్యుని నింద్రసేన నతిభక్తి నారాధించుచుండె. ఒకనాడు వాని నుచ్ఛిష్టంబు కుడుచుచున్నంత వాని పెనుప్రేలు కూటిలోన దునిసి పడియున్న రోయక యన్నంబుకుడుచు చున్నంత మౌద్గల్యుండు చూచి యామె పతిభక్తికి మెచ్చి వరంబు వేడుమనియె. ఇంద్రసేన యిట్లను- 'మునీంద్రా: నాకుం గామోపభోగేచ్ఛ పెద్దకలదు. నీవును దపశ్శక్తి కామరూపుండవయి యీ బీభత్సరూపం బుడిగి మనోహరంబయిన యాకారంబునఁ బంచధా విభక్తుండ వయి నన్ను రమించికామోపభోగంబులం దనుపుమనియె. మౌద్గల్యుం డును నట్లే ననేక సహస్ర వర్షంబుల నాలాయనియైన యింద్రసేన నుప భోగించి తృప్తుండై పిమ్మట ఘోరతపంబు సేసి బ్రహ్మమయుండై బ్రహ్మ లోకంబునకుం జనియె. ఇంద్రసేనయు నా కామభోగంబులం దనియక కాల వశంబున శరీరంబువిడిచి కాశీరాజను రాజర్షికిం జనియించె. కన్యాత్వంబున బెక్కు కాలముండి తన దౌర్భాగ్యమునకు నిర్వేదించి పతింగోరి పశుపతిం గూర్చి యుగ్రతపంబు సేయుచుండెను. ఆమెకడకు యమధర్మరాజు,

నింద్రుఁడు, వాయువు నశ్వినీదేవతలువచ్చి యామెను తమతమ యాత్మ దేహాంశజులకు దేహాంతరమునఁ బత్నిగాఁ గోరిరి. ఆమె ఘోరతపంబునకు మెచ్చి ప్రత్యక్షముకాగా నామె పతిదానము ప్రసాదింపుమని యర్థిత్వమున నేనుమారులువేఁడినఁ గరుణించి యీశ్వరుం డామెకు దేహాంతరమున నేవురు పతులగుదురని వరమిచ్చెను. ఆమె కోరికమేరకు నేవురుపతులయందును ప్రత్యేక సంగమంబునకుఁ జాలినఁ గౌమారంబును, బతిశుశ్రూషాసిద్ధియు, గామభోగేచ్ఛయు, సౌభాగ్యంబును బ్రసాదించి చనియె. వేదవ్యాసుండు పంచపాండవుల పూర్వరూపంబులను యాజ్ఞసేని పూర్వరూపంబును బ్రత్యక్షముసేసి ద్రుపదు నొడఁబరచి పాండవులతో ద్రౌపది వివాహము జరిపించెను.

# ౭

విశ్వకర్మ పాండవులకు నింద్రప్రస్థపురము నిర్మించి యొసంగె. ధృతరాష్ట్రుఁడు యుధిష్ఠిరున కర్ధ రాజ్య మొసంగెను. యుధిష్ఠిరుఁడును నింద్రప్రస్థపురము రాజధానిగా రాజ్య మేలెను. ఆ యింద్రప్రస్థపురము నింద్రుని పురముతోఁ గుబేరు పురముతో వరుణేంద్రుపురము తోడ నురగ రాజపురవిభూతితోడ సరియగునట్లు నిర్మించెను.

ఇమ్మగ విశ్వకర్మ రచియించిన కాంచన హర్మ్య తుంగ శృం
గమ్ముల రశ్మిరేఖలు ప్రకాశములై కడుఁ బర్వి తత్సమీ
పమ్మున బాఱుచున్న ఘనపంక్తుల యం దచిరద్యుతి ప్రతా
నమ్ములఁ గ్రేణి సేయుచు ననారతమున్ విలసిల్లుఁ దత్పురిన్.

అలఘుతరంబులై తుహినహారి సుధారుచి నిందురోచిరా
కుల శశికాంతవేది పృథు కుంజ గళజ్జలనిర్ఝరంబులన్
విలసిత జాహ్నవీ విమల వీచి విలోల లసత్పతాకలం
బొలుపగుఁ దత్పురీ భవనముల్ హిమశైలముఁ బోలి యున్నతిన్.

వననిధి లోని రత్నములు వాసుకి మూర్ధజ రత్న సంఘముల్
కొనఁగ నవశ్యమున్ జనులకున్ సమకూరదు గాన నెప్పుడున్
గొనుడు పదార్థ రత్నములు కోరిన వానిన యిత్తు మత్తెఱం
గునఁ బచరింతు రంగడులఁ గోమటు లప్పురి నిద్ధరత్నముల్.

పరిఘ జలంబులం దమల పంకరుహోత్పల కైరవాది సుం
దర కుసుమంబులున్ ఘన పథంబున నుజ్జ్వల తారకా నిరం
తర కుసుమంబులున్ వెలయుఁ దత్పుర వప్రము పాదపీఠికా
శిరముల నొప్ప నర్చనలు చేసిన పువ్వుల యవ్విధంబునన్.

తమము నడంచుచున్ వెలుగు తత్పుర గోపుర శాతకుంభ కుం
భముల విచిత్ర సన్మణిగభస్తి వితానములన్ విచిత్ర వ
ర్ణములగు నాత్మవాహముల నమ్మక పల్మఱుఁ జూచి యన్య వా
హములని సంశయప్రణిహితాత్ముడగున్ హరిదశ్వుఁ డెప్పుడున్.

సరళ తమాల తాల హరిచందన చంపక నారికేళ కే
సర కదళీ లవంగ పనస క్రముకార్జున కేతకీ లతా
గరు ఘనసార సాల సహకార మహీరుహరాజరాజి సుం
దర నవనందనావళులఁ దత్పుర బాహ్యము లొప్పు జూడఁగాన్.

అనిలం బప్పురిఁ బౌరచిత్తముల కత్యానంద మొందంగ నం
దిని యన్నేటితరంగలం బెనగుచున్ దివ్య ద్రుమాకీర్ణ నం

దన సందోహము దూఱుచున్ వికచకేత క్యాది నానాలతాం
తనవామోదముఁ బొందుచున్ సుడియు నిత్యంబుం గరం బిష్టమై.

ఇది యింద్రప్రస్థపుర వర్ణన. తరువాతి ప్రబంధకవులు తమ తమ ప్రబంధములలోఁ జేసిన పుర వర్ణన కీ పద్యములే మార్గదర్శకము లైనవి. అష్టాదశ వర్ణనలు, కవి సమయములు, ఋతు వర్ణనలు, పుర వర్ణనలు, మంగళా శాసనము, నిష్టదేవతా స్తుతి, పూర్వకవి స్తుతి, కుకవినింద, షష్ఠ్యంతములు, నాశ్వాసాంత పద్యములు మున్నుగా గలఁ బ్రబంధ లక్షణ లకుఁ జాలవఱకుఁ గవిత్రయమువారి మహాభారతమే యొజ్జబంతి యన వలసి యున్నది.

పార్థుండు పంచతీర్థంబు దర్శించిన సందర్భమున బ్రాహ్మణుని యాధిక్యత మఱొక్కమాఱు వక్కాణింపఁబడ్డది.

అలుగుదురయ్య విప్రులు మహాపురుషుల్ పరుషాపరాధముల్
దలఁగెడు వారు ధర్మువులు దప్పక సల్పెడువారు సత్యముల్
పలికెడువారల వారి కపాయము డెందములం దలంచు మూ
ర్ఖులకు విధాతృచెయ్వున నగున్ దురితంబులు దుర్యశంబులున్.

పార్థుఁడు తీర్థయాత్రల కరుగుట, ఉలూచి, చిత్రాంగదలను వివాహం బగుట, సుభద్రా కళ్యాణము, ఖాండవ దహనము మున్నగు కథాంశములు గలవు. ఈ సందర్భముననే మందపా లోపాఖ్యాన ముల్లే ఖింపఁ బడినది. మందపాలుఁడు ముని ముఖ్యుఁడు. బ్రహ్మచర్యమున దివ్య సహస్రవర్షంబు లతినైష్ఠికుఁడై యత్యుగ్ర తపము సేసి యోగాభ్యాసవశం బున దేహంబు విడిచి పుణ్యలోకములకుఁ జనెను. తనకుఁ బుణ్యలోక ప్రాప్తి యేల కలుగలేదని దేవతలనుఁ బ్రశ్నించె. అందులకు సమాధాన ముగా దేవత లిట్లనిరి.

ఎంత తపం బొనరించియు
సంతానము లేనివారు సద్గతిఁ బొందం
గాంతురె నీ తప మేటికి
సంతానము వడయు మరిగి సన్మునినాథా.

అతండు వేగంబ సంతానంబు వడయనెంచి చరిత యను శార్ఙ్గ పక్షిని తాను శార్ఙ్గకుండై రమించి చరితారి, సారిసృక్వ, స్తంబమిత్ర మఱియు ద్రోణు లను నల్వురు పుత్త్రులఁ గని ఖాండవ దహనంబునప్పుడు నగ్నిదేవునిఁ బ్రార్థించి వారల రక్షించె. వారు పరమబ్రహ్మ విదులు వారును నాలుగు వేదమ్ముల నగ్నిభట్టారకుని స్తుతియించి యభయముం బొందిరి.

పాండవులకు మయుండు మయసభ నిర్మించి యొసంగె. ధర్మరాజు మయసభలో శుభప్రవేశ మొనర్చె. ఇచ్చట రత్నమువంటి మఱొక్క పద్యము.

మదమాతంగ తురంగ కాంచనలసన్మాణిక్య గాణిక్య సం
పద లోలిం గొనివచ్చి యిచ్చి ముదమొప్పం గాంచి సేవించి ర
య్యుదయాస్త్రాచల సేతుశీతనగమధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయున్ ధర్మజుఁ దత్సభాస్థితు జగత్పూర్ణ ప్రతాపోదయున్.

ఆ మయసభ కెందఱో తపోధను లేగిరి. వైశంపాయనుఁడు నుడిగె. మయసభ కేగిన మహర్షుల నొక్కమాఱు స్మరించిన జన్మ సార్థక మగును.

సుబల మార్కండేయ శునక మౌంజాయన
మాండవ్య శాండిల్య మందపాల
బక దాల్భ్య రైభ్యక బాలుకి జతుకర్ణ
గౌతమ కౌశిక కణ్వ కుత్స

సావర్ణి పర్ణాద సత్య గోపతి గోప
వేష మైత్రేయ పవిత్రపాణి
ఘటజాను కాత్రేయ కఠ కలాప సుమిత్ర
హరీత తిత్తిరి యాజ్ఞవల్క్య
వాయుభక్ష భార్గవ వ్యాస జైమిని
శుక సుమంత పైల సువ్రతాదు
లయిన మునులు నేము నరిగితి మెంతయు
రమ్యమయిన ధర్మరాజు సభకు

వైశంపాయన మహర్షి జనమేజయునకు భారతకథ నంతను నుత్తమ పురుషలోఁ జెప్పుచున్నట్లు విదితము. నారదమహర్షి పనుపున ధర్మజుండు రాజసూయ యాగము సంకల్పించెను. శాంతనవుండు గడుంగడు సంతసిల్లి ధర్మజున కిట్లనియె.

స్నాతకుండును ఋత్విజుండును సద్గుణుండు ననిష్టుడున్
భూతవేశుఁడు, సంజయుండును బూజనీయులు వీరిలోఁ
బ్రీతి నెవ్వఁడు సద్గుణంబులఁ బెద్ద యట్టి మహాత్ము వి
ఖ్యాతుఁ బూజితుఁ జేయు మొక్కనిఁ గౌరవాన్వయ వర్ధనా.

గాంగేయుననుజ్ఞంజేసి సకల లోకపూజ్యుండైన నచ్యుతుఁబూజింప సంకల్పించె.ఇందులకుఁ గినిసి శిశుపాలుండిట్లని యధిక్షేపించెను. అనేకులు పెద్దలుండగాఁ గృష్ణు కష్టచరితు వార్ష్ణేయుఁ బూజించి నీయవివేకంబెఱిగించి తిందఱకునని యుల్లసమాడినాఁడు. దాశార్హుండు పూజార్హుండేయని యెత్తిపొడిచినాఁడు. ఇది యంతయు గాంగేయు దుర్వ్యవసాయమఁట. వృద్ధుల బుద్ధులు సంచలింపవే? అని వ్యాఖ్యానించినాఁడు.

ఈతని వృద్ధని పూజించితే-అట్లైన వసుదేవుఁ బూజింపవలె. ఋత్వి

జుండని పూజించినచోఁ గృష్ణద్వైపాయనుండు పూజార్హుఁడు-ఆచార్యుఁడని వినయమునఁ బూజించినచోఁ గృతమతులు ద్రోణుఁడునుఁ, గృపుఁడును బూజనీయులు. భూనాథుఁడని పూజించితివని తృప్తిపడుదమన్నను యాదవుల్ రాజులే యవనిమీద నని యీసడించినాడు. తుదకు.

చనఁ బేడికి దారక్రియ
యును జెవిటికి మధురగీతియును జీకున క
త్యనుపమసురూపదర్శన
మును జేయుటఁ బోలు గృష్ణుఁ బూజించు టిలన్.

కృష్ణు పూజించుట పేడికి దారక్రియ యఁట. ఆ శిశుపాలుని సమాధానపఱచుటకు ధర్మజుఁ డెన్నియో ప్రియవచనములు బల్కినాఁడు.

ఆదిజుఁడైన బ్రహ్మయుదయంబున కాస్పదమైనవాఁడు వే
దాదిసమస్త వాఙ్మయములందుఁ బ్రశంసితుఁడైన వాఁడు లో
కాది త్రిలోకపూజ్యుఁ డని యాత్మనెఱింగి పితామహుండుదా
మోదరుఁ జెప్పెఁ బూజ్యుడని యుక్తమ కాకిది యేమిదోసమేః

శిశుపాలుండు పాలిత దుర్ణయుండు రాగకోప పరిభూత మనస్కుఁడు. అల్పరాజ్య లక్ష్మీలలనాంధబుద్ధి అనిమిత్త మహత్పరివాద శీలి కనుక వీనిని సమాధానపఱుపయత్నించుట వ్యర్థమని భీష్ముఁడు వక్కాణించెను. సహదేవుం డుగ్రుఁడై ధిక్కరించిన రాజన్యుల మస్తకంబు పై నిడియెదనంచుఁ దాఁ జరణమెత్తె- అప్పుడు సహదేవునిపై దేవతలు పుష్పవృష్టిఁ గురియించిరి. సభాసదులెల్లరు విస్మయాకులిత మనస్కులైరి. కలహ భోజనుఁడైన నారదుఁడో మిక్కిలి వేడుకతో దనకుంచెయుఁ గృష్ణమృగాజినంబును పలుమరు వీచుచు విలాసముగా నాడెనఁట. ఇయ్యది నారదమహర్షికి సంతోషకారణము. శిశుపాలుఁడు చేయునదిలేక గాంగేయుని 'ముదివెట్టి'

యని యధిక్షేపించినాఁడు. కృష్ణుని బెక్కుభంగుల వ్యంగ్యోక్తుల దూషించి నాఁడు. భీమసేనుండు సహనముఁ గోల్పోయి రౌద్రాకారమున నిట్లుగా గర్జించెను.

ప్రకటిత కోపవేగమునఁ బద్మదళాయత నేత్రముల్ భయా
నకతరలీలఁ దాల్చె నరుణద్యుతి నద్భుతమై త్రిశాఖమై
భ్రుకుటిలలాట దేశమునఁ బొల్చెఁ ద్రికూటతటిత్రిమార్గగా
నుకృతిఁ బ్రభంజన ప్రియతనూజున కంతకమూర్తి కచ్చటన్.

శిశుపాలుఁడు ధర్మజుని రాజసూయ యాగమున బలిపశువు. వానికి నూఱు తప్పులవఱకు నభయము కలదు. వాసుదేవుఁడు చక్రాయుధముచే శిశుపాలుని వధియించి రాజసూయ యాగము సఫలముఁ జేసెను.

సుయోధనుండు మయసభలోఁ బరాభూతుఁడయ్యెను. రాజసూయ యాగమున ధర్మజుని వైభవమును గన్నులారఁగాంచిన సుయోధనుఁ డీర్ష్యా పరవశుఁడై **నాడు.** తనగోడునంతను మేనమామయైన శకునితో మొఱబెట్టు కొన్నాఁడు.

నీవును జూచితట్టి సభనేని వినంబడ దేయుగంబులన్
భూవలయంబులో నది యపూర్వము సర్వమనోజ్ఞ మిష్టభో
గావహ మే క్రియం బడసెనయ్య మహాత్ముఁడు దాననేమిసం
భావిత భాగ్యుఁడయ్యెను ప్రభాకరతేజుఁడు ధర్మజుం డిలన్.

నీవును చూచినావుకదా! అట్టి సభనేని వినంబడ దేయుగంబులన్ "ఇది యొక విచిత్రమైన ప్రయోగము'. 'కచుండునేనియున్‌రాఁడు'. అని నట్లు. 'అట్టి సభవినఁబడ నైనను వినఁబడ దేయుగంబులన్'అని భావము.

పుడమిలో నతిప్రసిద్ధులగు భూపతు లెల్లరు కడు భయమంది

వైశ్యుల పోలె వశ్యులై మహా ధనావళులఁ దెచ్చియిచ్చిరి. ఆ ధనరాసుల దానము సేయుట వలనఁ బృథాగ్ర పుత్త్రుఁడైన యుధిష్ఠిరునకుఁ బార్థివత్వ మబ్బె. యుధిష్ఠిరునకుఁ బార్థివత్వ మబ్బుటకు వారి శౌర్యసాహసములు మాత్రమే కారణము కాదని భావము. భూపతులు వైశ్యులవలె కడు భయ మంది వశ్యులైరఁట. వైశ్యులు కడు భీరులను నానుడి నాఁటనుండియు ప్రసిద్ధమే కాబోలును. సుయోధనుఁ డీర్ష్యాళు వయ్యును ధర్మజుని 'ఆమహా త్ముఁడు, ప్రభాకర తేజుఁడు' నని పేర్కొనుట విశేషము.

యాదవు చేతిచక్రము భయంకరమై శిశుపాల మస్తక
చ్ఛేదము సేసినం గడుఁ బ్రసిద్ధులు శూరులు నైన రాజుల
య్యాదవు ముందటన్ జయజయ ధ్వనులిచ్చిరి గాని వాని శౌ
ర్యోదయ వృత్తి కట్టెదుర నోపర యెవ్వరు విక్రమింపగాన్.

ఇఁట యాదవ పదము రెండుమాఱులు ప్రయుక్తమైనది. పాండవ పక్షపాతియైన యచ్యుతునిపై సుయోధనునికిఁ గల మత్సర మిందు సూచితము. సుయోధనుని యుధిష్ఠిరుండు రాజసూయయాగ సందర్భమున రత్నపరిగ్రహణంబు నందు నియోగించెను. సుయోధనుని మాటలలో 'సర్వరత్నాకరైక ప్రశస్త పుంజములకాస్పదము ధర్మపుత్త్ర గృహము'.

ఒక్క లక్ష భూసురోత్తముల్ గుడిచిన
మొనసి తనకుఁ దాన మ్రోయు శంఖ
మొక్క నిమిషమేని యుడుగక మ్రోసె న
య్యధ్వరోత్సవంబు నన్ని నాళ్ళు.

యజ్ఞము చూడగా సకల భూములనుండి వచ్చిన రాజన్యవరులను, భూసురులను, వైశ్యులను, శూద్రులను నాత్మీయ బంధు సుహృద్వీర భట నియోగ జనులను, పేదలను, సాదలను నిత్యంబుఁ దాన పరీక్షించి తగు

వెఱింగి యన్నంబు దయc బెట్టి యందఱు గుడిచినంత యర్ధరాత్రమున ద్రౌపది కుడిచెనcట. ఆ మ్మహాధ్వరమున నధముcడయ్యు గడుc బ్రియంబున నభ్యర్చితుండ కాని వంచితుండు కాcడు. ఇంతయేల?

ధరణి హరిశ్చంద్రుcడు భా
సుర యశుcడయి చేసె రాజసూయం బదియున్
సరి గాదని యే వగతును
సురుచిర విభవమునc బాండు సుత యజ్ఞముతోన్.

అని సుయోధనుండు ఖండితముగాc జెప్పెను.

మత్సర గ్రస్తుcడై సుయోధనుండు పాండవుల రాజ్యమును ధనమును నపహరింపc గోరి శకుని పనుపున వారితో సుహృద్ద్యూతము నారంభించెను. యుధిష్ఠిరుండు తన సర్వస్వమును, తన్నును, తన సహోదరులనుc తుదకు భార్యనుc గూడ నోటు పడియెను. సుయోధను నానతినిc బ్రాతికామి ద్రౌపదిని సభా మధ్యంబునకుc గొనితేర నఱిగెను. వానికిc బాంచాలి యిట్లను.

ఏ యుగంబునందు నెట్టి దుష్కృతవుండు
భార్య నొడ్డి యోటువడిన భర్త
కలcడె యిది వినఁగc గడు నపూర్వంబయ్యె
యిట్లు చేయు నొక్కc యిందుకులుcడు.

ద్రౌపదీ పాత్ర పోషణమున నన్నయగారు చాల నేర్పు చూపిరి. ద్రౌపదీ పాత్ర ప్రవేశః మీ ఘట్టముననే ప్రారంభము. ఆమె లోకవృత్త మెఱుంగని ముగ్ధకాదు. లౌక్యము నెఱింగిన జాణ. చాల గడుసరి. కనుకనే

మున్ను దన్నోటువడి మఱి నన్ను నోటు
వడియెనో నన్ను మున్నోటువడి విభుండు
క్రన్న తన్నోటు వడియెనో యన్న నాకు
నెఱుఁగఁ జెప్పుము దాని నీ వెఱుఁగుదేని.

ఎఱుంగ వేని యక్కితవు నడిగివచ్చి మఱి నన్నుం దోడ్కొని పోవ నగునేనిఁ దోడ్కొని పొమ్మనెను. ఇందుఁ జాల మర్మమున్నది. ముందు తన్నోటు వడెనా? లేక ద్రౌపది నోటువడితన్నోటు వడెనా? యని ప్రశ్నము. ముందు తన్నోటు పడినవాఁడు ద్రౌపదిని పణంబు సేయుటకు వలనుపడదు, ఓటు పడినవాఁడు తన సోదరులకందఱను సాధారణ ధనంబైన ద్రౌపదిని పన్నిదము నొడ్డుట యక్రమము. పతివ్రతయు మహాసాధ్వియు, నయోనిజయు నయిన భార్యనుఁ బణంబు సేసిన ధర్మజుని 'దుష్కితవుం' డవి నిందించినది. అంతియ కాదు. ఎఱుంగవేని యక్కితవు నడిగివచ్చి, మఱి నన్నుం దోడ్కొని పోవ నగునేని దోడ్కొని పొమ్మనెను.

కడకు ధూర్తుఁడై దుశ్శాసనుండు

అవనజాసనం గురుకులాపశదుండు కడంగి రాజసూ
యావభృథంబునందు వసుధామరమంత్ర పవిత్రవారి ధా
రావళిఁ జేసి పావనములైన శిరోజములం దెమల్చి పా
పావహుఁ డీడ్చితెచ్చె సభ కందఱు సంభ్రమమంది చూడఁగన్,

ఈ పద్యములో నన్నయగారు నాటకీయతను నిరూపించినారు. చిత్రము కన్నులకు గట్టిన ట్లున్నది. దుశ్శాసనునిఁ గురుకులాపశదుండు పాపావహుఁడు అనుట వలన వాని దౌష్ట్యము సూచితము. ద్రౌపదిని సభ కీడ్చి తెచ్చెననినఁ జాలును. కాని రాజసూయయాగమున నవభృథ

స్నానము చేసినప్పుడు భూసురులయొక్క మంత్రముల చేత పవిత్ర మైనఁ జలములఁ జేతఁ బావనములైన శిరోజములను తెమల్చి యీడ్చి తెచ్చెను. తెమల్చుటయు సీడ్చుటయు సమానార్థకములే. ఇది పునరుక్తి. ఆలాగునే నీ పాప కార్యమునకుఁ గర్తయైన దుశ్శాసనునిఁ గురు కులాపశదుండని కడంగి యని పాపావహుఁ డీడ్చి తెచ్చెనని రెండుక్రియలు. రెండు కర్తృ శబ్దములు. ఇదియుఁ బునరుక్తి. నన్నయగారి రసాభ్యుచిత బంధమున కిది తలమానికము. ఈ పద్యము వలన భావికాలమున జరుగ బోవు కౌరవ వినాశము సూచితము.

సన్నివేశ నిష్ఠమైన రసమునుఁ బోషించుటకు రసోచిత మైన పద ముల కూర్పునే శయ్య యనవలసి యున్నది. ఈ కార్యమునఁ గవి యెంతటి సమర్థుఁడైనచో నా కావ్య మంత రాణించును. రచన హృద యంగమ మగును. సన్నివేశము కన్నులకుఁ గట్టినట్లుండి సహృదయులైన పాఠకుల రంజింపఁ జేయును. అందుకే భామహుఁ డిట్లు చెప్పెను.

మాలాకారో రచయతి యథా సాధు విజ్ఞాయ మాలాం
యోజ్యం కావ్యేష్వవహితధియా తద్వ దేవాభిధానం

పూలమాలను గట్టువాఁడే పువ్వునే పువ్వుతో జోడించినచో బాగుగా నుండునో యది లెస్సగాఁ విచారించి కట్టునట్లు కవియు నవధాన ముతో నే పదముతో నే పదమును జోడించినచో నందముగా నుండునో తెలిసికొని రచింపవలెను. దీనికే Wordsworth అను నాంగ్లకవి 'The choice of best words in best place' అనెను.

కౌరవసభలో ద్రౌపదీ ప్రశ్నమునకు సమాధానము చెప్పినవారు లేరు. భీష్మ, ద్రోణ, కృపాదులును, విదురుఁడును, మున్నగువారు కామ్య.

క్రోధాదులు దక్కి ధర్మనిర్ణయము సేయరైరి. తుదకు వికర్ణుఁ డను వాఁడు ధర్మనిర్ణయము జేసెను. జూదంబును వేఁటయుఁ, బానంబును బహుభక్షణాసక్తియు నను నాలుగు దుర్వ్యసనంబు లనఁ దగిలిన పురుషుఁడు ధర్మువు దప్పి వర్తిల్లు. అట్టివాని కృత్యంబులు సేకొనం దగవు. కితవాహూతుండై వ్యసనవర్తి యయి పరాజితుండైన పాండవాగ్రజుండు పాండవుల కందఱకు సాధారణ ధనంబైన పాంచాలి పణంబు సేసె. కావున ద్రౌపది యధర్మవిజిత యని నిర్ణయము చేసెను. కాని కర్ణుఁడు వికర్ణుని పలుకుల నధిక్షేపించి యిట్లను.

ఎల్లవారు నెఱుఁగ నొల్లని ధర్మువు
బేల నీకు నీలఁ జెప్పవలసెఁ
బిఱుతవాని కింత తరుసంటి పలుకులు
చన్నె వృద్ధజనము లున్నచోట.

కురు వృద్ధ బాంధవు లనేకులు చూచుచుండగనే కౌరవసభలో ద్రౌపదిని వస్త్రము లపహరించి పరాభవించిరి. ఇయ్యది పాపకార్య మని యెఱింగియు భీష్మ ద్రోణ కృపాది వృద్ధులు వారింపరైరి. భీమసేనుండు క్రోధావేశమున నారభటీరీతిలో నిట్లుగా నాక్రోశించె.

కురువృద్ధుల్ గురువృద్ధపాండవు లనేకుల్ చూచుచుండిన్ మదో
ద్ధురుఁడై ద్రౌపది నట్లుచేసిన ఖలున్ దుశ్శాసనున్ లోక భీ
కర లీలన్ వధియించి తద్విపుల వక్షశ్శైలరక్తౌఘని
ర్ఝర ముర్వీపతి చూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్.

కురుక్షేత్ర సంగ్రామమునకు plan of operation సిద్ధమగు చున్నదన్నమాట.

# 10

అరణ్యవాసము చేయుచున్నతఱి పాండవుల క్షేమ మరయుటకుఁ బెక్కురు మహనీయులు వచ్చిరి. శౌనకుం డేతెంచి ధర్మజునకు దుఃఖో పశమనములైన ధర్మముల నుపదేశించెను. స్నేహజంబులైన మానసదుఃఖ ములు జలంబుల నగ్ని యుపశమిల్లునట్లు విమలజ్ఞానంబునం జేసి యుపశ మిల్లు నని వక్కాణించెను. బంధు మిత్ర ధన సంచయంబుల వలసి స్నేహంబు దగదు. స్నేహంబున రాగంబును, రాగంబునఁ గామం బును, గామంబునఁ గ్రోధంబునుఁ, గ్రోధంబున దృష్ణయు వర్తిల్లు.

లోకోత్తరమైన యుపమానములను గడు హృదయంగమముగాఁ బ్రయోగించుటలో నన్నపార్యుఁ డందె వేసిన చేయి. విదురుండు ధృత రాష్ట్రుఁ జేతఁ బరిహరింపఁ బడి పాండవుల పాలికి ద్వైతవనంబున వచ్చిన వాఁ డిట్లను. "రూపలావణ్య వతియై వృద్ధ శ్రోత్రియునిఁ జేత బరిణీతం బైన తరుణియుం బోలె రాజ్యలక్ష్మి య ద్దురాత్ము నందు విరక్తయ కానిఁ బ్రీతిఁ బుట్టింపదు."

ధర్మజు డరణ్యవాసావసరంబున కఠినశిలల నట్టాడుటం జేసి పాదము లెఱ్ఱనయినఁతత నిట్లని యుపమించును.

పర నరేంద్ర మకుట పద్మరాగద్యుతి
నరుణమగు భవత్పదాబ్జ యుగము
పరుషదారు శిలలపై నిప్పు డరుగుట
నరుణమయ్యెఁ బర్వతాంతములను.

శత్రురాజ కిరీట మందలి పద్మరాగమణుల యొక్క కాంతిచే నెఱ్ఱనైన యుధిష్ఠరుని పాదముల యెఱ్ఱదనము కనికందలేదు. ఎట్లన పర్వతాంతమునఁ బరుషదారు శిలలపై నిప్పు దరుగుట యుధిష్ఠిరు పాదములు కంది యెఱ్ఱనైనవి.

అట్లె కిరాత వేషముననున్న పరమశివునితో యుద్ధము చేయుచున్న పార్థుఁ డిట్లని తలపోయును. 'నా యేసిన యపార దుర్వారనారాచంబు లవివేకి యందుఁ బ్రయుక్తంబు లయిన సుభాషితంబులుం బోలె వీనియందు నిష్ఫలంబులగు చున్నవి, ఇట్లెన్నియో యుపమానంబులను పేర్కొనవచ్చును.

ఉత్తములకుఁ గ్రోధంబు దగదనియు క్షమాగుణమే సర్వోత్కృష్టంబనియు వక్కాణింపఁ బడియె. కౌరవులచేఁ బరాభవింపఁ బడి తమ సర్వస్వముఁ గోల్పోయి ద్వైతవనంబున నున్నతఱి ద్రౌపది ధర్మజుని కార్యోన్ముఖునిఁ జేయ సమకట్టి కౌరవుల నిర్జింప నుద్బోధిచును. ఆమె నుపశమింపఁ జేయుచు నుత్తములకుఁ గ్రోధము దగదనియు క్షమాగుణమే సర్వశ్రేయ మనియు సప్రమాణముగా నిరూపించును. క్రోధము పాపము. క్రోధము చేతనే ధర్మకామార్థ హాని యగును. క్రోధి కర్జంబు కానడు. క్రుద్ధుండు గురునైన నిందించును. క్రుద్ధుడైనవాఁ డనవధ్యుల నైన వధియించు. ఆత్మఘాతంబు సేయను గడంగు. అట్టి క్రోధము ధర్మజాదుల గుణంబు కాదు. ఎఱుకగల మహాత్ములు క్రోధమను మహానలమును జ్ఞాన మను జలముచే నార్చును. తేజః ప్రభవంబులైన యమర్ష దాక్షిణ్య శౌర్య శీఘ్రత్వంబు లను నాలుగు గుణంబులు క్షమావంతునంద వీర్యవంతము లగు. వేదంబులు యజ్ఞంబులు, శౌచంబును సత్యంబును విద్యయు ధర్మవు సచరాచర జగమంతయు క్షమయంద నిలిచినవి. స్వాధ్యాయ యజ్ఞకర్తఅయు బ్రహ్మ విదులయు బడయు పుణ్యగతులు క్షమావంతులు వడయుదురు.

ధర్మజుని పాత్రను చాల నుదాత్తముగాఁ దీర్చిదిద్దెను. నన్నయగారి ధర్మజుఁడు ధీరోదాత్తుఁడు, క్షమావంతుడు, నక్రోధనుఁడు, స్థిర సంకల్పుఁడు, దృఢచిత్తము కలవాఁడు, కృష్ణద్వైపాయన, భీష్మ విదుర కృప ద్రోణ సంజయ ప్రభృతు లాతని యుపశమనంబ కీర్తింతురను నాత్మ విశ్వాసము కలవాఁడు.

ధర్మజుని క్షమాగుణము నధిక్షేపించుచున్న పాంచాలి నిట్లుగా మందలించెను. 'నాస్తికుల యట్లు ధర్మాభిశంకినివై దైవదూషణంబు సేసెదు. శిష్టచరితంబైన ధర్మంబునధిక్షేపించుచున్న దుర్మతికిఁ బ్రాయశ్చిత్తంబులేదు. ధర్మువుతప్ప కనిత్యులై జీవించుచున్న మైత్రేయ, మార్కండేయ, వ్యాస, వశిష్ఠ, నారదప్రభృతులం బరమయోగధరులం బ్రత్యక్షంబు చూచెదము. వీరెల్లరు నన్ను ధర్మపరుండని మన్నింతురు. అన్యులన్యాయంబు సేసిరని నేనేల ధర్మువు తప్పుదును.' నన్నయగారు తీర్చిదిద్దిన ధర్మజుఁడు ధీరోదాత్త నాయకుఁడు- ఉదాత్తచరిత్రుఁడు- స్థిర సంకల్పుడు.

అర్జునుఁడు పరమేశ్వరు నారాధించుట. కిరాతవేషములోనున్న పరమశివునితో యుద్ధము సేయుట. పాశుపతాస్త్రముఁ గొనుట. యింద్రాగమనము - పార్థుఁడు వాసవపురి కేగుట. యూర్వశివలన పార్థుండుశాప గ్రస్తుండగుట. బృహదశ్వుండు ధర్మజునకు నలోపాఖ్యానముఁ జెప్పుట - నారదుండు ధర్మజునకు సకలతీర్థ ప్రాశస్త్యము నుగ్గడించుట మున్నుగాఁ గల కథాంశములు గలవు.

రోమశుని యుపదేశంబున ధర్మజుండు తన యనుజులతో సకల తీర్థాభిగమనంబు సేసి, తీర్థాభిగమనావసరంబున నానాతీర్థంబులను దర్శించు నవసరంబున రోమశుండు తీర్థప్రాశస్త్యంబును బెక్కుపాఖ్యానములను వివరించెను. అట్టివానిలోఁ బేర్కొనఁదగినది యగస్త్యుని చరిత్ర— ఈ

చరిత్రమును రోమశుండు ధర్మరాజునకుఁ జెప్పెను. అగస్త్యుడు పెద్ద కాల ముగ్రతపంబు సేయుచు వనంబున పరిభ్రమించు వాఁడొక్క సల్లకీ పల్లవంబున నధోముఖులై వ్రేలుచున్న తన పితరులనుజూచి కారణంబర సిన వారిట్లనిరి. 'మేము నీ పితరులము. నీవు బ్రహ్మచారివై యధికనిష్ఠ తపంబు సేయుదువు. సంతానము నొల్లవు. అదియకారణముగా మాకూర్ధ్వ గతులు లేవు. కనుక నీవు వివాంహంబయి, సంతానంబువడసి మాకుఁ బుణ్యగతులు కలిగింపుమని కోరిరి. అగస్త్యుఁడు తన తపశ్శక్తింజేసి విదర్భ రాజునకొక కూతుం బుట్టించెను. ఆమెయే లోపాముద్ర. అగ స్త్యుఁడు లోపాముద్రను వివాహమయ్యెను. భార్య పనుపున ధనార్థియై శ్రుత పర్వుండను రాజు పాలికింలోయి యిట్లను. నీ పోష్యజన పోషణంబునకు విఘాతంబు గాకుండ మిగులు ధనము కలదేని తనకిమ్మనియెను. వాని యొద్ద మిగులు ధనములేకుంట బధ్నశ్వ నొద్దకును, త్రసదస్యు నొద్దకును బోయి వారి యొద్దను మిగులు ధనములేమి యెఱింగి వారంచఱును నిల్వలు నొద్దకుఁబోయిరి. వాఁడును బ్రాహ్మణుల భోజనమున కాహ్వానించి తన సహోదరుఁడైన వాతాపిని మేకంజేసి వారికి వండిపెట్ట వారు తిన్నంత వాతాపిని వారి గర్భంబునుండి వెలువడ సంబోధించుచుండు.వాతాపియు వారి గర్భంబు భేదించుకుని బయల్వెడలి ఆ బ్రాహ్మణుల భుజించుచుండుదురు. అందుచే నగస్త్యాదుల నాయిల్వలుం డాహ్వానింప వెంటనున్న శ్రుతపర్వుఁడు వారింప నమ్మనీంద్రుఁడు "నత్యలఘుఁడు వారి మాటకు భయపడ కెంతయుఁ బ్రీతితోడ నగ్గలముగఁజేసె భోజనము గంఠముదాఁక నకుంఠ వీర్యుఁడై." అగస్త్యుఁడు కంఠముదాఁక భోజనముచేసెనఁట. ఇచ్చట పాఠకునికి నన్నయ్యగారు సున్నితమైన హాస్యము నందించిరి.

అగస్త్యుడును వలసిన ధనమును గొనిపోయి లోపాముద్రకోరిన విధంబున నామెకు గర్భాధానమొనర్చిన నామెయు నేడేండ్లు గర్భంబు ధరించి దృఢస్యుఁడనఁగా ననవద్యుఁడు వేదములు రహస్యములతో నొనరఁగ జపము సేయుచుఁ బుట్టెను.

ఇనుండు మేరుపర్వతముచుట్టు ననుదినంబుఁ బ్రదక్షిణముజేయుట కలిగి యినశశితారాదులకుం గనరాకుండఁగఁ బెరిగి వింధ్యం బుత్తుంగ మయ్యెను. రవిశశిగతు లుడుగుడు దివమది రాత్రియిది యని జనులకుఁ దెలియరాదయ్యె. జగమంతయు నంధకారమయ్యె. సురలెల్లరు వింధ్య పర్వతంబు వర్ధనంబు వారింపనోపక నగస్త్యుం బ్రార్థించిన నగస్త్యుండును లోపాముద్రా సహితుండై దక్షిణదిశ కేగెద తెరువిమ్మని యడిగినంత వింధ్య మ్మతివినయంబున భూమి సమానమయ్యె. అంత నగస్త్యుంషు నామగుడి వచ్చునంతకు నట్లేయుండుమని యరిఁగి మగిడిరాఁడయ్యె. విధ్యంబును నగస్త్యుడు మగిడివచ్చు నంతకుఁ బెరుగనోడి యట్లేయుండె.

ఒకప్పుడు కాలకేయులను రాక్షసులు పగలెల్ల మునులను భూజనులను బాధించి రాత్రియందు సముద్రములో దాగియుందురు. దేవతలు వారి బాధలకోర్వఁజాలక సాగరమున దాగియున్నవారితోఁ బోరజాలక యగస్త్యుఁ బ్రార్థించిన యాతండు సాగరజలంబెల్లఁ బానంబుజేసె అంత కాలకేయులను సురలు సంహరించిరి.

తొల్లి యిక్ష్వాకువంశమున సగరుఁడనురాజు హైహయుల నిర్జించి రాజ్యమేలుచుండె. ఆతం డనపత్యుండగుటంజేసి పరమశివుఁగూర్చి ఘోర తపంబొనరిచెను. సగరుని ప్రథమ భార్యయైన వైదర్భియందు నరువది వేవురు కొడుకులును రెండవ భార్యయైన శైబ్యయందు నొక్కకుమారుండు వంశకరుండు పుట్టునటు వరమిచ్చెను. కొంతకాలమునకు వైదర్భియు శైబ్యయు గర్భంబుధరించిన వైదర్భియందొక్క యలాబూఫలంబు (సొర కాయ)ఉద్భవమయ్యె. అందుండిపుట్టిన యఱువదివేవురు పుత్రులు కడుదర్పితులై లోకకంటకులైరి. శైబ్యయందు నసమంజసుఁడను పుత్రుఁడు కలిగెను. ఇంట్లుండ నొకప్పుడు సగర మహారాజు నశ్వమేధ యాగదీక్షితుం డైన వానియాగాశ్వము 'సగరపుత్రులఁచేత రక్షితంబై తోయహీనమైన జలధిఁజొచ్చియదృశ్యమయ్యె,సగరపుత్రులు భూతలపాతాళంబుల నెల్లరోసి

యాగాశ్వంబుఁగానక యుదధియంతయు గ్రొచ్చిగ్రొచ్చి సాగర పూర్వోత్తరదేశంబున గపిలుండను మునివరు నాశ్రమ సమీపమున యాగాశ్వమునుగాంచిరి. కపిలుఁ డీ యాగాశ్వము నపహరించెనని భావించి కడు క్రుద్ధులై సగరసుతులు కపిలుని పరాభవించిరి. కపిలుండును కరంబలిగి యనలశిఖలఁదూల నతిఘోరదృష్టింజూచిన సగరసుతులు భస్మమైరి. కొంతకాలమునకు సగరుని మనుమడు, నసమంజసుని పుత్రుఁడునైన నంశుమంతుఁడు తాతపనుపున కపిలు నాశ్రమునకేఁగి కపిలమహర్షి నారాధించి యాగాశ్వమునుదెచ్చి యశ్వమేధయాగము పరిసమాప్తి నందించెను. కపిలమహర్షి యానతి నంశుమంతుని పౌత్రుండు భగీరథుండు గంగ నారాధించి గంగాజలౌఘంబుఁదెచ్చి సాగరమును నింపి సగరపుత్రుల కుత్తమ గతులు కలిగించెను. భగీరంధుఁడు గంగావతరణమునకై తపంబుసేయ గంగయుఁ గరుణించి భగీరథుని కిట్లను.

నేను వచ్చునపుడు నానిరంతరజలౌ
ఘంబుఁ దాల్ప నీలకంఠుఁ డోపుఁ
గాని యొరులు దాల్పఁగా నోప రయ్యుమా
నాథు కరుణబడయు నన్నుదాల్ప.

ఇఁట గంగాదేవి శంకరు నుమానాథుగాఁ బేర్కొని యాతనిఁ గరుణబడయుమనును భగీరథుండును నట్లే యీశ్వరు నారాధించి యాతని నొడబరచి భాగీరథి నవని కవతరింపఁజేసి-

ఇలకుం గంగతరంగ సంగతులతో నేతెంచె నాకాంతరం
బులు నాకాశముఁ గప్పుచుండఁగ మహాభూత ప్రపంచంబుతోఁ
జెలులై యుండఁగ దాని నీశ్వరుఁడు దాల్చెన్ సంగతోత్తుంగపిం
గళజూటాగ్రమునందుఁ బద్మదళ సంకాశంబుగా లీలతోన్.

భగీరథ ప్రయత్నమున నాకాశంబుననుండి శివజటాజూటము ప్రవేశించి యవని కవతరించిన వియద్గంగయొక్క యార్భాటముగాని,

యోజస్సుకాని యీ పద్యమునలేవు. ఈ పద్యము మందాకినీ గమనము కలదిగానున్నది.

రోమశుండు ధర్మజునకు ఋశ్యశృంగుని చరిత్రమును జెప్పెను. కశ్యపునిఁ బుత్రుఁడు విభాండకుఁడు మహాతపస్వి.

విభాండకుం డఖండిత బ్రహ్మచర్యంబునం దపంబు సేయుచు నొక్కమడువున నీళ్ళాడుచున్న యవసరంబున.

సురుచిర సురూపగుణ సుం
దరి యూర్వశి యను లతాంగి తద్దర్శన గో
చరయగుడు నపుడు రేత
స్ఖలనం బమ్మునికి నయ్యెఁ గామకృతమునన్.

అయ్యమోఘవీర్యంబుతో మిశ్రంబయిన జలంబు నొక్క దుప్పి పెంటి మృగంబు ద్రావి గర్భబు దాల్చిన నందు ఋశ్యశృంగుఁడను కుమారుఁడు జన్మించెను. రోమపాదుఁడను మహారాజు రాజ్యమున ననావృష్టి యగుడు దేశంబు సుభిక్షంబుజేయుకొఱకు ఋశ్యశృంగు తోడ్తేర వేశ్యలఁ బంచెను. ఋశ్యశృంగుఁ డెచ్చటనుండు నచ్చట సంతతవర్ష మగునట్లు పరమేశ్వరువలన వరంబుఁ బొందియుండె. ఋశ్యశృంగుని పాలికిఁబోయిన వేశ్యను ఋశ్యశృంగుఁడు మునిబాలకుగా భావించెను. ఆవేశ్యయొక్క లాలిత్యముచేతను, విలాసముచేతను, హావభావవిశేషములచేతను ఋశ్యశృంగుఁ డాకర్షింపఁబడియె. ఋశ్యశృంగుఁడు తండ్రితో నిట్లను.

నన్నును గౌఁగలించుకొని నా వదనంబునకున్ నిజాస్యమా
సన్నముఁజేసి యొక్కమృదు శబ్దముసేసి మనోహరంబుగా
నెన్నడు నట్టిశబ్దము మునీశ్వర మున్ విని యేనెఱుంగ న
య్యన్నువ బ్రహ్మచారి ముఖ మంబురుహంబుసమంబు సూడఁగన్.

ఇచ్చట ఋశ్యశృంగుని యమాయికత్వము సూచితము. సున్నిత

మైన హాస్యము ధ్వనించుచున్నది. రోమశుండు ధర్మజునకు బెక్కుపాఖ్యానములను జెప్పెను.

అకృతవ్రణుఁడు ధర్మజునకుఁ బరశురాముని మాహాత్మ్యమును జెప్పెను. తొల్లి కన్యాకుబ్జమును గాధియను రాజు పాలించుచుండెను. వాని కూతురు సత్యవతి- భృగు పుత్త్రిండైన ఋచీకుఁడను వాఁడా కన్యను వివాహమాడఁగోరి వాని నడుగ నాగాధియు నొక్క కర్ణము నీలోత్పల శ్యామమై తనువెల్ల శశిహంసధవళమైనట్టి వేయి హయములను కుంకుమగాఁ గోరెను. ఋచీకుండును వరుణేంద్రునొద్ద సహస్రహయంబులఁ గొని గాధికిచ్చి సత్యవతిం బాణిగ్రహణంబయ్యె. వారికి జమదగ్ని బుట్టి ప్రసేనజితుండను రాజు కూతురు రేణుక యను దాని వివాహమయ్యెను. వారికిఁ బరశురాముఁడు జన్మించెను కార్తవీర్యుఁడు జమదగ్ని హోమధేనువును గొనిపోగాఁ బరశురాముఁ డా కార్తవీర్యుని వధియించి హోమధేనువును దేర కార్తవీర్యుని పుత్త్రిలు పరశురాముఁ డాశ్రమున లేనితఱి క్రుద్ధులై జమదగ్నిని వధించిరి. పరశురాముఁడును కరం బలిగి క్షత్రియ సంహారము సేయఁ బ్రతినఁబూనెను. పరశురాముఁడు క్షత్త్రియ సంహారముఁజేసి దిగ్దంతిదంతార్గళాఘాట మహీచక్రంబు సాధించి విహితవివిధాధ్వరుండై కశ్యపునకు నార్త్విజ్య దక్షిణగా నఖిలభూవలయంబునిచ్చి నిస్సంగుఁడై మహేంద్ర పర్వతంబునందు నిత్యుండైయున్న పరశురాముని ధర్మజుం డనుజ సహితుండై జూచి పూజించి దక్షిణంబునకుం జని దక్షిణగంగ యనఁబరఁగిన గోదావరీనదిం గనియె.

భూవినుతం బై త్రిభువన
పావనమై త్ర్యంబకప్రభవమైన జలౌ
ఘావళిఁ బవిత్రమగు గో
దావరి పుణ్యనదిఁ గనియె దక్షిణగంగన్.

ఇట్టి పవిత్ర గోదావరీతీరంబున నీ గ్రంథంబు రచింపఁబడు

చున్నది. అనంతరము పాండవులు సోమశ్రితతోయయైన పయోష్ణియందుఁ గృతస్నాతులైరి. ఈ పయోష్ణి ప్రాశస్త్యమునుఁ జెప్పుచు రోమశుండు సౌకన్యాఖ్యానముఁ జెప్పెను పయోష్ణియందుఁ గృతస్నాతులైనవారు దేవసాయుజ్యము వడయుదురు. పిమ్మట నర్మదాస్నానముఁజేసి వైదూర్య పర్వతముఁగనిరి. ఇయ్యది త్రేతాద్వాపరసంధి— ఈ సరోవరతీరమే శర్యాతి యజ్ఞ ప్రదేశము...శర్యాతి కూతురు సుకన్య-భార్గవు తనయుఁడైన చ్యవనుండా సరోవర తీరంబునఁ దపంబుసేయుచు వల్మీకముచేఁ గప్పఁబడి నేత్రములు మాత్రము విలసత్ఖద్యోత ద్యుతులవలె ప్రకాశించుచుండ సుకన్య బాల్యచాపల్యమున సైనికుల చేత నావల్మీకంబును గ్రొప్పించెను. చ్యవనుండు కరం బలిగి సైనికులకు మూత్రపురీషంబుల నిరోధించిన శర్యాతియు తన కుమార్తెయు నతిశయ రూపలావణ్యయైన సుకన్య వధువుగా నర్పించి చ్యవనునను గ్రహంబు వడసె. చ్యవనుండు తపఃక్లేశంబునఁ గృశత్వగస్థి భూతశరీరుండు నతివృద్ధుఁడునయ్యు యశ్వినుల యనుగ్రహంబున నవయౌవనుండయ్యె. చ్యవనుండు శర్యాతిచేయు యజ్ఞంబున నశ్వినీదేవతల సోమపీథులఁజేసెను. రోమశుండు మాంధాతృ చరిత్రంబును, సోమకుండను రాజర్షి చరిత్రమ్మును, శిబియను రాజర్షి చరిత్రమ్మను, నష్టావక్రు చరిత్రమ్మును, యవక్రీతు చరిత్రమ్మును జెప్పెను.

తొల్లి భరద్వాజుండును రైభ్యకుండను మునివరుండును వనంబునఁ దపంబు సేయుచుండిరి. అర్వావసుఁడు, పరావసుఁడు ననువారలు రైభ్యుని కుమారులు. తపోసంపన్నులు. సకలవేదవేదాంగ పారంగతులు. యవక్రీతుండు భరద్వాజుని పుత్త్రుఁడు. విద్వత్పూజితుండైన రైభ్యకుని, నతని కుమారులఁజూచి సహింపఁజాలక యవక్రీతుండు తపోబలంబున సకల వేదశాస్త్రాగమములు బడయుదునని యగ్నియందు సంధార్యంబు సంధించుచు నుగ్రతపంబు నారంభించిన నద్దానిని సహింపనోపక శక్రునకు యవక్రీతుం డిట్లనియె.

గురు ముఖమునఁ బడయక దు
ష్కర తపముంజేసి వడయఁగాఁబడు విద్యల్
పరమార్థము మదమును మ
త్సరమును గావించు నెట్టి వారలకైనన్.

ఇది విద్యోపార్జన కుపాయంబుగాదు. అని శక్రుఁడెన్ని విధముల సమాధానించినను వినఁడయ్యె భరద్వాజుండును కుమారునికి దేవగీతలైన గాథలందు మేధావి యనువాఁడు గర్వియై ధనుషాక్షుడను మునివరు నధిక్షేపించి వానివలనఁ బంచత్వంబు బొందిన విధం బెఱింగించెను. గర్వంబు చెట్ట యెట్టివారికైన. కావున గర్వంబువిడిచి యకోపనుఁడవై, పరమశాంతులైన రైభ్యకొడుకులఁదోడ నిర్మత్సరుండై యుండునట్లు యవక్రీతు భరద్వాజుండు నాదేశించెను. యవక్రీతుండు రైభ్యకు నాశ్రమంబున కేగి యాతనిఁ గోడలిఁజూచి మదన పరవశుఁడై యామెను గోరినంత నామెయు రైభ్యునికెఱిఁగించిన నాతఁడు యవక్రీతుఁ దనకోపానలంబున కాహుతిఁజేసెను. భరద్వాజుండు పుత్రశోకంబున నాత్మాహుతిగావించుకొనియె. బృహద్యుమ్ముని సత్త్రయాగమునకుఁ దండ్రి పనుపున నర్వావసుండును, పరావసుండును ఋత్విజులుగానేగిరి. ఒక్కనాఁడు పరావసుండు నిజాశ్రమంబునకరుగువాఁడు చీకటినడవిలో నేకతంబువెదుఱువచ్చు రైభ్యుని మృగంబుగాఁదలచి యాత్మరక్షణార్థము నాతని వధించెను. అంత నర్వావసుండు సహోదరువలన నంతయునెఱింగి సత్రయాగము నిర్వహింపఁగా సోదరునినియమించి యాతఁడు బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తంబులు సేసి పరావసునిఁ బాపవిముక్తుంజేసెను. సురల యనుగ్రహంబునఁ దన తండ్రిని, భరద్వాజుని, యవక్రీతుని సంజీవితులఁజేసెను. యవక్రీతుండు సురల నిట్లుగాఁబ్రుచ్ఛించె. ఏను బహుశాస్త్రములెఱింగి వ్రతములెల్లఁజేయుచు రైభ్యుచే నిట్లు హతుఁడనైతి నాకంటె రైభ్యుని కధిక శక్తియెను తెఱఁగెట్లు-అనిన వానికి సుర లిట్లనిరి.

గురుశుశ్రూష యొనర్చుచుఁ
బరమక్లేశమునఁ జేసి పడసిన విద్యల్
స్ఫురియించుఁగాక గురుముఖ
విరహితముగఁబడసినవియు వెలయునె యెందున్.

నీవు గురుముఖంబునం బడయక యొండువిధంబునం బడయుటం జేసి నీ యధ్యయనశ్రుతంబులు నిర్వీర్యములయ్యె. గురు శుశ్రూషాసంతోషకరుండై రైభ్యుండు బ్రహ్మజ్ఞానం బుపార్జించెగావున నాతండిట్టి శక్తివడసె ననిరి. ఈ యాఖ్యానమువలన గురువరప్రసాదితంబు గాని బ్రహ్మజ్ఞానము నిర్వీర్యమని యర్థము.

# 11

పాండవులు గంధమాదన పర్వతమును గాంచిరి. 'గంధమాదన శైలేంద్రముఁ గాంచి రున్నత బృహద్ధాతుస్థలీసంహతిన్ ఘన సంధ్యాగమ శంక సన్మునులకుం గావించు దానిన్ మహిన్' ఇచ్చట భ్రాంతిమదలంకారము చక్కఁగా నిరూపింపఁబడినది.

నానా వర్ణశిలా విహ
గానేకమృగాభిరామమై భూ నారీ
నానాభరణ విభూషిత
పీనోన్నతకుచముఁబోలె వెలిగెడు దానిన్.

ఇదియేమి యుపమ? నానావర్ణములు గలిగిన శిలలఁజేతను, నానా విధములైన పక్షులఁచేతను, మృగములఁచేతను, నొప్పుచున్న గంధ

మాదన పర్వతము నానాభరణ విభూషితమై, పీనమై, యున్నతమై యొప్పు భూనారీకుచమును బోలియున్నదఁట. నన్నపార్యు డిచ్చట చక్కని చిక్కని శృంగారము నందించినాఁడు.

లలితాచ్ఛ స్ఫటికశిలా
తలములపైఁబాఱు విమల తల నిర్ఝరిణీ
జలపూరములను తారో
ల్లలదురుహారాలి నుజ్వలంబగు దానిన్.

లలితమును, స్వచ్ఛమును నైన శిలాతలములపైఁ బాఱు విమలతరమైన జలముతో నిండిన సెలయేళ్ళనెడి హారావళులచేఁ బ్రకాశించుచున్నదట. ఇదియునొక చక్కని రూపకము. అప్పుడు ప్రచండమైన వర్షము కురిసెనఁట. ఎట్లు?

కురిసెఁ బ్రచండవృష్టి ఘనఘోషమునెల్ల కెలంకులన్ భయం
కరములు గాఁగ రాలె కరకాతతు లొప్పఁ టిల్లతాళివి
స్ఫురితముగాఁ బ్రపూర్ణజలపూరము లగ్గిరికుంజభూరిని
ర్ఝరతటినీవిశాలతట సాలచయంబు విమూలితంబుగన్.

పాండవులు భాగీరథీ తీరంబుఁదాఁకిరి. ఇచ్చటనే ద్రౌపది సౌగంధిక పుష్పములను గోరును. భీమసేనుఁడు సౌగంధికా హరణార్థము గంధమాదన పర్వతము నధిరోహించి యొక్కకదళీషండమధ్యంబున నొక్క విశాలశిలాతలంబుపై శయనించిన వాని నేకాంత యోగనిద్రనున్న ధర్మ నిర్మలు హనుమంతుఁ జూచె భీముదును నాంజనేయుం డాసి సింహనాదంబుఁజేసెను. హనుమంతుఁడును మెల్లమెల్లన మేల్కని జృంభసంభృత జలార్ద్రి సంచలిత విలోచనుండగుచు ననాదరంబ నాతనిఁజూచి యిట్లనియె.

అతిజరారోగ భయమున నలసి యొలసి
యొదిగి సుఖనిద్రమై యిట్టు లున్నవాని

గడు మదంబున నేమియుఁ గరుణలేక
యేల బోధించితయ్య నీవెఱిఁగి యెఱిఁగి.

తిర్యగ్జాతులు ధర్మమెఱుంగవు. సర్వభూత దయా స్వరూపంబైన ధర్మ వెఱిఁగెడివారు మనుష్యులు. ఇట్టి మనుష్య జన్మంబు వడసియు వృద్ధ సేవసేయ నోపవుగాకేమి. ధర్మ మెఱుంగక నిర్దయుండవై మాఁబోఁటిపేద మృగంబులకు భయంబుగ గర్జిల్లితివి. అమృత కల్పంబులైన యీ ఫలంబు లుపయోగించి క్రమ్మఱుము. బద్ధస్నేహుండగుట బుద్ధిసెప్పితిని. నా పలుకులు చేకొనుమనియె. ఇందు మందలింపు గలదు. ఊరార్పుగలదు. హెచ్చరికగలదు. బుజ్జగింపుఁగలదు. చివరకు ననుశాసనమును గలదు. హనుమంతుని వాక్చాతుర్యమును గమనింపవలె. భీమసేనునితో నీయన సంవాద మంతయు నుదాత్తముగా నున్నది. చిన్నపిల్లవానికి సుద్దులు చెప్పినట్లున్నది. భీముం డిట్లను నేనుకార్యార్థినై యేఁగుచున్నవాఁడ-తెరువిమ్ము-ఈయని నాఁడు తొల్లిశతయోజన విస్తారంబయిన సముద్రము లంఘించి లంకకుం బోయిన హనుమంతునట్ల నిన్ను నీ పర్వతంబు లంఘించి పోదు ననియెను. అంత హనుమంతుఁడు భీముని బిభీషణలు లెక్క సేయలేదు. సరికదా 'అతం డేమి కారణంబున సముద్రలంఘనంబుఁజేసెః నీవెఱుఁగు దేనిఁ జెప్పుమనియె. హనుమ నిరంతర రామనామ జపతత్పరుఁడు. రామ కథను మఱొక్కమాఱు భీముని నోట విని తరింపవలెనని యాకాంక్ష. భీముఁడు క్లుప్తముగా మూఁడు కందములలో కథ చెప్పెను.

అలఘుయశుం డిక్ష్వాకుని
కులతిలకుఁడు రాఘవుండు గురువచన మిలన్
నిలిపి వనవాసియై తన
లలనం గోల్పడియె నట్టి లంకేశ్వరుచేతన్.
సీతాన్వేషణ పరులై
నీతిఁ గపిప్రవరు లరిగి నియతంబుగ సం

పాతి యను పక్షి చేత మ
హాతనయసువార్తలెల్ల నెఱిఁగి కడంకన్
వారలు వారధి గడవఁగ
నేరక తారున్న యెడ ననిలసత్త్వమునన్
వారిధి లంఘించె మహా
వీరుఁడు హనుమంతుఁ డనఁగ వింధుఁ గపీంద్రా!

ఏను హనుమంతు నంతియ బలపరాక్రమములు గలవాఁడ నా పౌరుషంబుఁ జూపుదునే యనిన నవ్యక్తహాసముఖుం డగుచు నన్నా యేను ముదిసినవాఁడ లేవనోపను బోయెదవేని నా తోకం బాయంద్రోచి పొమ్మనెను. భీముండు తన బలపరాక్రమములచేఁ దోక గదల్పఁజాలక హనుమకుఁ బ్రణమిల్లిన 'నగుచు నేను గేసరిక్షేత్రంబున వాయు భట్టారకునకుం బుట్టినవాఁడ నీ చెప్పిన హనుమంతుండనని జెప్పి భీముని కోరికపై దన పూర్వరూపముఁ జూపెను. ఆ రూపమెట్లున్నది?

అతులితమై ద్వితీయ కనకాద్రియొకో యిది నా నిజాంగ మూ
ర్జితముగఁ బెంచి పుచ్ఛమునఁజేసి దిగంతము లందుచున్న యు
న్నతుఁ గపినాథుఁ జూచి కురునందను డప్డు నిమీలితాక్షుఁడై
మతి నతివిస్మితుండగుచు మారుతి కిట్లనియెన్ భయంబునన్.

అతిభీషణ మిది యత్య
ద్భుత మోహో చాలు భూనభోమధ్యవ్యా
పితమయ్యె భవద్దేహ
యతత్త్వ ముపసంహరింపు మనవుడుఁ గపియున్.

హనుమంతుఁడు భీమునకు చాతుర్యుగ ధర్మములఁ బోధించెను. నీవు సౌగంధిక సరోవరంబునకుం బోయెదవే నందు సాహసంబు సేయవల దదు. అది యక్ష రాక్షస రక్షితంబై దేవతోపభోగయోగ్యంబైయుండు దేవతలు బలిహోమ నమస్కారంబుల మంత్ర తంత్రములంజేసి భక్తి

సాధ్యులుగాని సాహసక్రియా సాధ్యులుగారు. నీవు నిజధర్మ నిష్ఠితుండవై పరమ ధర్మంబు లెఱుంగునది. ధర్మాధర్మ విభాగం బెఱుగు విద్వాంసుల నుపాసించి శుభాచారుండవు గావలయు. ఆచారంబున ధర్మంబువుట్టు- ధర్మంబువలన వేదప్రతిష్ఠయగు. వేదంబులంజేసి యజ్ఞంబులు ప్రవర్తిల్లు. యజ్ఞంబున వలన దేవతలు తృప్తులగుదురు. సర్వకార్యంబులు మంత్ర మూలకంబులు. విద్యాంగులై ప్రబుద్ధులైన వారితో మంత్రంబు సేయునది బాలకులయు, నధికశ్రీదర్పితులయు, లుబ్ధులయు, లఘుజనంబులయు తోడ మంత్రంబు సేయవలదని బోధించెను. ఇది యంతయు గురుశిష్య సంవాదమువలె నున్నది. హనుమ భీమునకు నుత్తమమైన ధర్మములను నీతులను బోధించెను. ఇందెంతయో కరుణ, యాత్మీయత యున్నవి.

తుదకు రణాంతరంబున నన్ను దలంచునది

నీ యందు సౌహృదంబున నాహవంబులో నతిరథుండైన యర్జును. రథ ధ్వజంబునందుండి మీ బలపరాక్రమముం జూతునని వరమిచ్చి, హనుమ యంత ర్హితుండయ్యె

# 12

ద్రౌపది యొక్కనాడు శ్వేతకీ నదివలన మారుతానీతంబులై సువర్ణమయంబులై తమ ముందటబడిన పంచవర్ణ సురభి కుసుమంబులం జూచి, భీమసేనుం డాసి తొంటి సౌగంధిక కనకాబ్జముఁ కంటె దివ్య సుగంధాదిక సుమములఁగని వానిందేరబంచెను. ఆతఁడును మణిమంతు నితోఁ బోరి వాని వధించి యక్కుసుమంబులుఁ దెచ్చెను. పాండవులు

యార్ష్టిషేణుండను మునివరు నాశ్రమంబున నివాస ముండిరి. అచ్చట నొక్క మాసంబు నివాస ముండిరి. ధనదపతియైన కుబేరుఁ డేతెంచి పాండవులకు వలసిన సౌకర్యముల నేర్పరించెను. స్వర్లోకమున నున్న యర్జునుని సప్తాశ్వమేధసంప్రాప్తపుణ్యుఁడు ధర్మమతి శంతనుఁడు పాండవులఁ గుశలమడిగెనఁట. ఆర్ష్టిషేణాశ్రమమున కుత్తరమునఁగల మందర పర్వతమును మేరుపర్వతమును ధౌమ్యుఁడు పాండవులకుఁ జూపెను.

అదె మందరనగ మక్కడ
యదె మేరు నగేంద్ర మమ్మహాశైలము నె
న్మిది దిక్కుల వసియింతురు
త్రిదశేంద్రుండొట్టి యష్టదిక్పాలవరుల్

కనకగిరిం బ్రదక్షిణముగా శశిభాస్కర తారకాగణం
బనవరతంబుఁ ద్రిమ్మరు మహామునిసప్తకమండలంబుతో
ననఘ తదీయతుంగశిఖరాగ్రమునందుఁ బయోరుహాసన
త్రినయన విష్ణులుండుదురు దేవగణంబులు గొల్చుచుండఁగన్

ఒక్క మాసము కాలము కుబేరుఁడు పాండవులతోఁ గాలక్షేపము సేసెనఁట. ఈ సమాగమము నొక్కయేడు దనరంగ బ్రహ్మచర్య వ్రతస్థులై తగిలి నిత్యంబు వినిన పుణ్యాత్ములు, చదివినవారు, నూఱేండ్లు జీవింతురు, ఇంద్రుసానతిని పార్థుండు నివాత కవచులను రాక్షసులను సంహరించెను. భీముం డజగరుఁజేత నోటువడెను. నహుషుండు నగస్త్యుని శాపంబున మహాజగరంబై గ్రుమ్మఱుచుండు.

అశనాశావివృతాస్య గహ్వరుఁ గృతాంతాకారు నిశ్వాసధూ
మశిఖాధూసరితోగ్రదగ్ధతరుగుల్మవ్రాతు హారిద్రవ
ర్ణశరీరున్ భృశరూక్షదర్శను మహానాగప్రభుం గాంచె న
ర్ధశశాంక ద్యుతిహాసిదారుణ చతుర్దంష్ట్రున్ జగత్త్రాసకున్.

ఇది మహాజగరంబు యొక్క స్వరూపంబు ఈతండు యయాతి జనకుఁడు. శతమఖుఁడైనవాఁడు. అజగరరూపంబున నున్న నహుషుండు తన్నుగూర్చి తానిట్లుగాఁ జెప్పినాఁడు.

చదివితి నెల్ల వేదములు, సద్విధిఁ జేసితి నూఱు యజ్ఞముల్
విదితముగా సురేంద్ర పదవీస్థితిఁ బొందితి దుర్మదంబునం
దుదిఁ బెనుఁ బామనై యధిక దుఃఖితుఁడైతి; సుఖంబు దుఃఖమున్
వదలక చేయుచోట బలవద్విధి కేమిభరంబు సెప్పుమా :

ఈతినిఁ బ్రశ్నంబులకెవ్వఁడు బ్రత్యుత్తరమీనోపునో యతడే శాప మోక్షకారకుఁడగునని యగస్త్యుడు ననుగ్రహించె కావున శాపమోక్షా సమయ ప్రతీక్షఁజేయుచు నిత్తఱి ధర్మజునిఁ బ్రశ్నలడుగఁ గోరెను. వానికి ధర్మజుం డిట్లను

నీ యడిగిన యర్థాభి, ప్రాయములకు నుత్తరంబు పరువడిఁజెప్పన్
ధీయుతబ్రాహ్మణులకుఁగా, కాయతమతులయ్యు నొరులకలవియె చెప్పన్?

బ్రాహ్మణుఁడెవ్వఁడు ? వాని జ్ఞానమెట్టిది ? అని ప్రశ్నను సత్య క్షమాదమ శౌచదయా తపోదానశీలము లెందేనిఁ గాననగునట్టివాఁడు బ్రాహ్మ ణుండగును. సుఖము దుఃఖమ్మునై నెడ విమోహమును బొందకునికియ వానికి నుత్తమంబగు విద్యయని యుత్తరము. మఱి యగ్గుణంబులు శూద్రు నందుఁగలిగిన నతండుత్తమ ద్విజుండు గానేర్చునే అట్లయిన బ్రాహ్మణాది వర్ణ విభాగమెట్లు గలుగును? హీనులు, నధికులు నను వివేకము అపార్థ మగును కదా : యని ప్రశ్నించెను.

సమాధానముగా నంతకాత్మజుం డిట్లను ప్రమాదంబున వర్ణసంక రంబయినప్పుడు వర్ణపరీక్షార్థంబుగా బ్రాహ్మణులకు వృత్తంబు వేఱవేఱ స్వాయంభవుండైన మనువుసెప్పె. సత్యాది గుణంబులు శూద్రునందుఁ

గలిగనేని వాఁడు సచ్ఛూద్రుండగు గాఁక బ్రాహ్మణుండు గానేరఁడు. అవి బ్రాహ్మణునందు లేనినాఁడు శూద్రుండయనంబడు కావున వృత్తంబులే యుత్తమములు. విత్తహీనుఁడు ప్రయత్నించి యనేక విధముల విత్తవంతుఁడుగ గాలుగును. వృత్తిహీనుండు విహీనుఁడే యగుగాని గోల్పోయిన వృత్తము మలల సంపాద్యముగాదు. కావున విత్తరక్షకంటె వృత్తరక్ష కడుంగడు మేలు.

అన్నృతవాదియయ్యు హింసగావింపని మహాత్ముఁ డేఁగు సుగతికి నంద్రు- అదియెట్లు? అని యజగరము తిరిగి ప్రశ్నించెను.

ధర్మజుఁ డిట్లు సమాధానముఁ జెప్పెను. దానంబును, ప్రియంబు చేఁతయును, సత్యంబును నహింసయు నగునవి నాలుగు సమానంబులు. అయినను నహింసయ విశేషంబు. దానాది గుణంబులుగలిగి యహింసాపరుండయినవాఁడు దేవగతివడయు. ఏతద్గుణహీనుఁడు తిర్యగ్యోనులఁ బొందును. అనుటవలన సత్యాహింసలు పరమధర్మములు సర్వకాల సర్వావస్థల యందు ననుసరణీయములు. వర్ణాశ్రమ ధర్మములు నేఁటికిని ననుల్లంఘనీయములు. కాని ప్రకృతకాలమున వీనికి వక్రభాష్యములు చెప్పఁబడి వర్ణభేదములు సమసిపోవలెననెడి వాదమునకు బలము జేకూరుట కాలవైపరీత్యము.

వర్షశరదృతు వర్ణనములుగలవు. అరణ్యమునందు ఖరకిరణతాపముచేత నురుతరదవదాహముచేత శోషితములయిన వృక్ష సంతతికిని వర్షాగమము నాప్యాయన కరమయ్యెను. నాల్గుదిక్కులను క్రొత్తమేఘములు ప్రాలి బహులస్థూల పయోధారలలో వర్షముగురిసెను ఘనతరమైన నిశి యందలి తమమో యనునట్లు దట్టమైన మేఘములయొక్క తమస్సుచేత లోకమంతయు చీకటికాఁగా జనుల కొక్కొక్కయెడ వైద్యుతరుచుల చేత వస్తు విభావన కలిగెను.

అరుదగు తత్పయోద సమయంబున నొక్కట విస్తరిల్లె నం
బరమున నంబుదధ్వనియుఁ బల్వల భూముల భూరిదర్దురో
త్కరరవముల్ మహీరుహ శిఖాంతములందు శిఖండితాండవాం
తరమదమంజులస్వన ముదారతర మ్యములై వనంబునన్

దళితనవీనకందళ కదంబ కదంబక కేతకీరజో
మిళితసుగంధ బంధురసమీరణుఁడన్ సఖుఁ డూఁచుచుండఁగా
నులియుచు మొల్ల గుత్తులను నుయ్యలలొప్పున నెక్కి యూఁగె ను
ల్లలదళినీకులంబు మృదుల ధ్వనిగీతము విస్తరించుచున్.

బాగుగా వికసించిన క్రొత్తవైన బహువిధ పుష్పరజో మిళిత సుగంధములతో నిండిన సమీరణుఁడను చెలికాఁడు ఊచుచుండఁగా మొల్ల గుత్తులను నుయ్యల లొప్పున నెక్కియూఁగెను. ఏవి... అళినీ కులంబు అనఁగాఁ దుమ్మెదల యొక్క సమూహము. మృదుల ధ్వనిగీతము విస్తరించుచు మొల్లగుత్తులపై నూఁగెనఁట. తుమ్మెదలు మొల్లగుత్తులపై వ్రాలుటయు, ఝుంకారములు చేయుటయు, తుమ్మెదలు వ్రాలినప్పుడు మొల్ల గుత్తులు గాలిచేత గదలాడుటయు సామాన్యమైన విషయములు. ఇట్టి సామాన్యమైన దృశ్యమును గవి తన ప్రతిభచేత నతిసుందరముగా మనోహరముగాఁ జిత్రించెను.

వర్షాకాలమున నేలయంతయు పచ్చమీరి కన్నులవిందుగా నుండును. ఆ దృశ్యమును గవి చక్కఁగా నుపమించెను.

సురచాప చిత్రగగన
స్ఫురణం బురుడించునట్లు భూవనిత నిరం
తరచిత్రితయై యొప్పెను
సురుచిర నవతృణ శిలీంధ్ర సురగోపములన్

వర్షములు వెనుకకుఁ బట్టుటతో శరదృతువు ప్రవేశించెను

భూపతికిం దివంబునకుఁ బొల్పెసఁగంగ శరత్సమాగమం
బాసకలప్రమోదకరమై విలసిల్లె మహర్షిమండలో
పాసిత రాజహంసగతి భాసిప్రసన్న సరస్వతీకమ
జ్ఞాసన శోభితంబగుచు నబ్జజు యానముతో సమానమై

శారదరాత్రు లుజ్జ్వలలసత్తర తారకహార పంక్తులం
జారుతరంబు లయ్యె వికసన్నవకైరవ గంధ బంధురో
దార సమీర సౌరభము తాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూర పరాగ పాండురుచి పూరము లంబరిపూరితంబులై.

నన్నపార్యుని శరద్వర్ణన మింతటితో నాఁగినది. ఈ శరద్వర్ణనము ప్రబంధ పరమేశ్వరుఁడును శంభుదాసుఁడు నైన యెఱ్ఱపార్యునిఁ గవితా మాధుర్యమునఁ గొనసాగినది.

స్ఫురదరుణాంశురాగ రుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమల వైభవ జృంభణ ముల్లసిల్లి ను
ద్ధురతర హంస సారస మధువ్రతనిస్వనముల్ సెలంగఁగాఁ
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూఁడఁగన్.

దానాంభః పటలంబునం బృథుపయోధారావలిం దాల్చి గ
ర్జానిర్ఘోషము బృంహిత చ్ఛలనఁ బ్రచ్ఛాదించి ప్రావృట్పయో
దానీకంబు శరద్భయంబున నిగూఢాకారతన్ డిగ్గనాఁ
గా నొప్పారె మదోత్కట ద్విరద సంఘంబుల్ వనాంతంబునన్.

కల నీలకంఠ కోలా
హల లీలలు సెలఁగు రాజహంసకులము లం

దీలకించె సప్త పర్ణా
వలి విగలిత కుసుమ కుటజవాటికలగెడన్.

అతి గాంభీర్య విభూతి నేక చుళికాహంకార నిశ్శేష శో
షిత పాథోధి పయస్కు(డైన ముని దో(చెం బుణ్య తేజోమయా
కృతి నయ్యామ్యదిగంత వీథిఁ బ్రకట క్రీడాకళా గర్వ గ
ర్జిత మండూక కళంకితాంబుశుచితా సిద్ధిప్రదాచార్యుడై.

విశద శారదాంబుజ పరివేష్టనమునఁ
బొలుచు గగనంబు ప్రతిబింబమో యనంగ
వికచకాశ వనీ పరివేష్టనమున
నతిశయిల్లె నిర్మల కమలాకరములు

అట్టి శారదాగమనంబున నుత్ఫుల్ల కమల కల్హార కేసర కరాళకలిత కల్లోల మానినియు ననేక మునిలోక సంతత సంసేవ్యమాన విపుల పులినో త్సంగయు నిరంతరతీరవానీరవన మండలీ విలసితయు నాకాశసంకాశ విశద సలిలయునైన మహాసరస్వతీ నది ఇత్యాది శరద్వర్ణనము.

ప్రబంధ పరమేశ్వరుండైన యెఱ్ఱనార్యుఁడు భారతారణ్య పర్వశేష మును నన్నపార్యుని పేరనే తెనిఁగించెను.

ఎఱ్ఱనార్యుండు సకల లోకైక విదితుఁ
డయిన నన్నయ్యభట్ట మహాకవీంద్రు
సరస సారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ
జెందుటయు సాధుజన హర్షసిద్ధిఁ గోరి

ధీర విచారుఁడు తత్కవి
తా రీతియుఁ గొంతదోఁప దద్రచనయకా

వారణ్య పర్వశేషము
పూరించెఁ గవీంద్ర కర్ణపుట పేయముగాన్.

ఎఱ్ఱనార్యుఁడు తాను పూరించిన భారతారణ్యపర్వ శేషమునందు సహితము నాశ్వాసాంత గద్యములందు "ఇది సకల సుకవిజన వినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీ మహాభారతము నందు" ఇత్యాదిగానే పేర్కొనెను.

విరాటపర్వ మాదిగాఁ దక్కిన పదునేను పర్వముల నాంధ్రీకరించిన కవిబ్రహ్మయు, నుభయకవిమిత్రుఁడును నైన తిక్కయజ్వ నన్నపార్యునిఁ బ్రశంస నిట్లుగా బేర్కొనెను.

ఆదరణీయసార వివిధార్థ గతి స్ఫురణంబు గల్గి య
ష్టాదశ పర్వ నిర్వహణ సంభృతమై పెనుపొంది యుండ నం
దాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వ విశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్.

పంచమవేద మనఁ బఱఁగిన మహాభారతగ్రంథము కవిత్రయము వారిచేతఁ బడి యాంధ్రీకరింపఁ బడుట యాంధ్రుల భాగ్యము.

మంగళం మహత్

సంపూర్ణము